# నివేదన

మాది పండిత వంశము. మా యింటి పేరు బృందావనం వారు. మా పితామహులు దివ్యశ్రీ తాండవ కృష్ణమాచార్యుల వారు సంస్కృతాంధ్ర భాషలలో ఆరితేరిన వారు. అధ్యయన అధ్యాపనములలో చక్కని శక్తిగలవారు.

మా తండ్రిగారైన దివ్య శ్రీ రంగాచార్యులుగారిని తమ వంటి పండితులుగా నొనర్చి పరమపదము నలంకరించినారు. మా తండ్రిగారు తాతగారి వరవడిలో తెనాలి సంస్కృత కళాశాలలో చదివి వంశానుగతమైన విద్వత్తునకు మేలి మెరుగులు దిద్దుకొని ఆంధ్ర విశ్వ విద్యాలయము వారు నిర్వహించిన ప్రాచ్యభాషా ( పట్టము ) బిరుదమును ప్రప్రథమస్థానమును సువర్ణ పతకమును సంపాదించుకొని వారు. పర్చూరు యార్లగడ్డ రామన్నోన్నత పాఠశాలలో రమారమి 40 సంIIలు ఉపాధ్యాయ వృత్తిని చేపట్టి అంకిత భావముతో కృషి చేశారు.

వక్తృత్వము మా తండ్రిగారికి జీవనాడి
గంధర్వ గాత్రము ఇలవేల్పు నారసింహుని వరము
కావ్య నిర్మాణ నైపుణ్యము పదలాలిత్యము
పద శబ్ద చండతాండవలీలలు
తాండవకృష్ణమాచార్యుని ఆశీస్సులు.
మృదు భాషిత్వము; గంభీరస్ఫురద్రూపము
మాపితామహి రాఘవమ్మగారి ఆశీర్వచన విశేషములు
కీర్తి ప్రతిష్టలు - సంపద -
మా మాతృదేవి పుష్పావతి పూజాఫలముగా

యావదాంధ్ర దేశములో జరిగిన మహాసభలలో వక్తగా, పలుభువనవిజయాది సరస్వతీ సామ్రాజ్యాలకు ప్రయోక్తగా బహుముఖ ప్రశంసలకు పాత్రమై స్వామీజీల ఆశీస్సుల నందుకొనివారు.

తిరుమల శ్రీవారి సన్నిధి, శ్రీశైలం, భద్రాచలం, అన్నవరం, విజయవాడ, బొంబాయి ఆంధ్ర మహాసభలలో ప్రసంగములుచేసి అనేకానేక సంస్థలకు ఆస్థాన పండితులుగా ఎనలేని కీర్తిగాంచినారు. మద్రాసు రాజ్యలక్ష్మి కళాపీఠము అవార్డు, ఉత్తమ ఉపాధ్యాయ సన్మానము లందినారు. ప్రపంచ తెలుగుమహాసభలలో భువనవిజయమునందు పింగళి సూరన పాత్ర వహించి "మధురకవి" బిరుదమును పొందారు. షుమారుగా 40 గ్రంథములను రచించి 1 లక్షా 24 వేల పద్యములను సందర్భానుసారముగా రచించారు. కవితా రీతులలో తన దైన బాణీతో తన కవితను దేశభక్తిగా ఆధ్యాత్మిక శక్తిగా, జీవన్ముక్తిగా మార్చుకొని ధన్య జీవనులైనారు.

తీరని ఋణములలో పితృ ఋణము ప్రధానమైనది. మా తండ్రిగారు 23-11-91న పరమపదమునలంకరించినారు. వారు జీవించి యుండగా ఏ రూపములోను వారి ఋణమును తీర్చుకొన లేకపోయినాము. ఈ 'రసగంగ' ముద్రణలో కొంత భారమును వహించి దీనికొక స్వరూపమును వారి ఆశీస్సులతో తే గలిగితిమి. రసజ్ఞులైన పాఠకులే ఇందలి ఔచిత్యమును గ్రహింపగల భావుకులు.

మూల గ్రంధకర్తయైన కీ॥ శే॥ శ్రీ అంబటిపూడి వెంకట రత్నంగారు గొప్ప పండితులు - వారి గ్రంథములపై గావించిన సమీక్షాత్మక గద్యకావ్యమిది. అనువాదము, సమీక్షలలో మా తండ్రిగారు చక్కని రీతిని ప్రదర్శించి కృతకృత్యులైనారని - పెద్దల అభిప్రాయము.

ఈ రసగంగ మా తండ్రిగారి తుది కోరిక. ఈ గ్రంథ ముద్రణము సాహిత్య శ్రీవరుడైన మా పితృ దేవులకు ఆ శ్రీయఃపతి; శాశ్వత పునరావాస రహిత మోక్ష ప్రాప్తి కలిగించునని —

ఆ మధుర కవి గళమునుండి జాల్వారిన 'రసగంగ' ఆస్తిక నాలుకలపై నడచి; ఆ పరమ పురుషుడైన శ్రీ వేంకటేశ్వరుని పాదముల చెంత పరవశించి పరవళ్ళు త్రొక్కి వారిరువురను యశశ్శరీరులుగా సాహిత్య లోకములో సుస్థిర పీఠము నలకరింపజేయగలదని మా ప్రగాఢ నమ్మకము

అందుకే వారి కోరికపై ఈ గ్రంథము శ్రీ వేంకటేశ్వర స్వామికే అంకితము. ముద్రణ విషయములో ఆర్థిక సహకారము నొనర్చిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

షుమారుగా 20 సం॥ల నుండి సాహిత్య కార్యక్రమములలో మా తండ్రిగారికి కుడి భుజముగానుండి-ప్రస్తుత-ఈ గ్రంథ ముద్రణలో సూచనల నందించిన తండ్రి తర్వాత తండ్రి అంతటి వాడైన మా పినతండ్రి శ్రీ బృందావనం నరసింహాచార్యులు ( రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత, సీనియర్ తెలుగు పండిట్, A.S. హైస్కూలు, పెదజాగర్లమూడి ) బాబాయికి మా వినయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

'శిష్యధనమే నా విశిష్టధనము' అని సగర్వంగా మా నాన్నగారు పలు సందర్భాలలో చెప్తుండేవారు. రాష్ట్రంలో ఏ మూలకు వెళ్ళినా ఉన్నత స్థితులలో నా శిష్యులుండి నన్నెంతో ఆదరించేవారని గర్వంగా చెప్పుకునేవారు. అలాంటి వారిలో ఒకడైన మిత్రులు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారు కోరగానే సంతోషపడి గ్రంథ ముద్రణను తక్కువ కాలంలో - అత్యంత ఆకర్షణీయంగా తమ స్పందన ప్రింటర్సులో అచ్చొత్తించి గురుభక్తిని ప్రదర్శించిన సహృదయునకు మా కృతజ్ఞతాభివందనములు.

అట్లానే వారి మరొక ప్రియ శిష్యుడు - శ్రీ లంకా ప్రసాదు గారు. ముఖ పత్ర చిత్రణ ద్వారా తన యూహలలో నున్న మా నాన్న గారిని అత్యద్భుతంగా మా తండ్రిగారిని తిరిగి మాకు చూపించినట్లుగా చిత్రించినారు. వారికి మా నాన్న గారి ఆశీస్సులు తప్పక వుంటాయి. మా అభినందనలు తెలుపుకొనుచున్నాము.

తమ శ్రీమద్రామాయణకల్పతరువు గ్రంథావిష్కరణ సందర్భముగా మేనల్లుడైన మా తండ్రిగారికి నివాళు లర్పిస్తూ వారి గ్రంథ ముద్రణకు రు. 600 విరాళముగా అందించిన పౌరాణికశేఖర, కవిరత్న, ఆగమాచార్య శ్రీమాన్ పరాంకుశం వేంకట శేషాచార్యులు పేర్నమిట్ట ప్రకాశంజిల్లా వారికి - వీరి కుమారుడు మా బావగారైన డా॥ పరాంకుశం సత్యనారాయణాచార్యులు B. A. M S. ( గవర్నమెంట్ డాక్టరు, ఒంగోలు) గారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

ఈ గ్రంథ నిర్మాణమునకు సూచనలు, సలహాలు, ఆశీస్సు లను అందించిన మా యింటి పెద్ద వైద్యశ్రీ డా॥ నారాయణం శ్రీనివాసాచార్యులు RMP పేర్నపాలెం వారికి మా కుటుంబ పక్షమున నమస్కృతులు తెలుపుకుంటున్నాము. ఆయనంటే మా నాన్నగారికి పంచ ప్రాణాలు. అది షుమారుగా 60 సం॥ల అనుబంధము - తరచుగా వారిపై తనకు గల భావాన్ని మాకు ఇలా చెపుతుండేవారు —

అన్నము నీరు ముట్టకయహర్నిశముల్ కనిపెట్టియుండి తా
కన్న కుమారుకన్నధికమ్ముగ శుశ్రూష చేయునట్టి మా
యన్నను శ్రీనివాసుని దయా పరిపూర్ణ హృదంతరాళు నే
నెన్నటికైన చూడ గలనే? నన్ను మిత్తి గ్రసింపబూనినన్.

ఇది వారి అవ్యాజ సోదరబంధము.

అలాగే గ్రంథ రచనకు నీడై, సాహిత్య సారస్వత కార్య క్రమాలకు తోడై నిలిచిన మా నాన్నగారి సతీర్థ్యులు శ్రీ ప్రతాప వేంకట సుబ్రహ్మణ్యంగారికి మేము ఋణపడి యున్నాము.

దీవి వారంటే నాన్నగారి కెంతో ప్రీతి. మా నాన్నగారి రచనలను చక్కగా ఓపికతో గుండ్రని వ్రాతతో వ్రాత ప్రతిని తయారు చేసి ఆయనకు తరచుగా సహకరించే దీవి సోదరులు-అనంతశయనం; శ్రీనివాస మూర్తులకు (తెలుగు పండితులు వై. ఆర్. హైస్కూలు, పర్చూరు) కృతజ్ఞతలు.

మా పితృదేవుల సంవత్సర వియోగ కార్యక్రమా లలోని, ప్రథమ వర్ధంతి; గ్రంథావిష్కరణ సభలకు విచ్చే సిన కవులకు, బంధువులకు, హితులకు ఆప్తులకు శిష్యులకు గౌరవించిన అభిమానులకు అందరికి మా హృదయపూర్వక అభివందన చందన మందార మాలలు. అభిప్రాయములు వ్రాసిచ్చిన పెద్దలకు నమస్సుమనస్సులు. తండ్రి వద్ద అధ్యయనము-మామతో కలిసి భోజనము అదృష్ట విశేషము లంటారు. నేను మా నాన్నగారి వద్దనే పంచకావ్యాలు చదువు కునే మహద్భాగ్యం అబ్బినది - నేర్చినది తక్కువ - నేర్వ వలసినది ఎక్కువని-అనుకుంటుండగనే వారిని మృత్యువు గ్రసించుట మా దురదృష్టము. ఆయన చూపిన అవ్యాజ మైన ప్రేమ మరువలేము. ఆయనతోటి మధుర స్మృతులు చెరగిపోనివి.

వారు నడచిన మార్గమున నడుస్తూ వారి ఆశయము లను, ఆదర్శములను గౌరవిస్తూ - వారి కీర్తి ప్రతిష్టలను అచంచలముగా - సాహిత్య లోకమున నిలుపవలెనను మా కృషికి మా యిలవేల్పు శ్రీలక్ష్మీనరసింహస్వామి కృప - పైనుండి మా నాన్నగారి దీవెనలు - పుష్కళంగా లభిస్తా యని ఆశించుచున్నాము. మా యీ కృషిలో సొగసులుంటే నాయనగారి కాతాలోను, లొసగులుంటే మా కాతాలో జమ వేసి మమ్ము ఆశీర్వదించవలనదిగా పెద్దలకు, పాఠకులకు- మా నివేదన. పితృదేవేభ్యోన్నమః.

ఇట్లు నమస్సులతో
విద్వజ్జన విధేయులు కుమారులు
బృందావనం వెంకట రమణాచార్యులు
సత్యనారాయణాచార్యులు
రామకృష్ణమాచార్యులు
లక్ష్మీ నారాయణాచార్యులు
మురళీకృష్ణ
పరుచూరి పద్మజ (కుమార్తె)
శ్రీనివాసుల కృష్ణకుమారి (కుమార్తె)

నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము నితాంత
అపార భూత దయయును
తాపస మందార నాకు దయసేయగదే.

# " మా రంగడు "

కీర్తి శేషులైన మా సోదరుడు బృందావనం రంగాచార్యులు మరణం వ్యక్తిగతంగా నాకు తీరని నష్టము ఆంధ్ర సాహిత్య లోకమునకు పూరించుటకు వీలులేని కొరత అయివున్నది. మా రంగడు తన జీవిత కాల మంతయు మంచిని పెంచి బంధుమిత్రాదులకు తన స్నేహ వాత్సల్యములను పంచి పెట్టినాడు. తన సాహిత్య ప్రక్రియల ద్వారా ఆంధ్ర భాషామతల్లిగళసీమను కవిత్వ కుసుమమాల అలంకరించి పూజించినాడు. అసదృశమైన మధురమైన తన ఉపన్యాసముల ద్వారా తెలుగు నేల గల సాహితీ పరులు మరియు ఇతర రాష్ట్రములలోని ఆంధ్ర సాహిత్య వేత్తలను ఆనందింపచేసినాడు. విద్యా వినయ వివేకములతో అందరిని గౌరవించి తను గౌరవించబడినాడు వాని యొక్క హృదయము మనస్సు వాక్కునుండి వెలువడిన యీ రసగంగ కృష్ణతత్వాన్నే కాక ఉమర్ ఖయ్యాం, రబ్బీ లాంటి విదేశీ తత్త్వవేత్తల తత్వాన్ని గూర్చి కూడా చక్కగా విశ్లేషించాడు. ఈ గ్రంథము ఆంధ్ర సాహిత్య ప్రపంచమునకు తుష్టిని, పుష్టిని చేకూర్చ గలదని ఆశిస్తున్నాను. వాని ఆత్మకు శాంతి గలుగు గాక. శేషించిన చిరంజీవులకు నా ఆశీస్సులు—

వైద్యశ్రీ

డా॥ నారాయణం శ్రీనివాసాచార్యులు

R.M.P.

వీరన్నపాలెం

# భగవదనుగ్రహ విశేషము

"మధురకవి" అభినవ పోతన 'బృందావనం' ఇత్యాది ప్రముఖ బిరుదాంకితులైన కీర్తిశేషులు బృందావనం రంగాచార్యుల వారు రచించిన 'రసగంగ'ను వారి కుమారులు చిరంజీవి వెంకటరమణాచార్యులు పంపగా చూచినాను.

శ్రీరంగాచార్యులవారు ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణ పతక గ్రహీతలయిన తెలుగు పట్టభద్రులు. వీరి 'గుహుడు' అన్న పద్యకావ్యము విశ్వవిద్యాలయ డిగ్రీ విద్యార్థులకు పాఠ్య భాగముగా పేరెన్నికగన్నది. వీరు మన రాష్ట్రమందేగాక, తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ మొదలైన రాష్ట్రములలో అనేక సభలలో పలు ఘనసన్మానములందిన ఆచార్యోత్తములు. నిరాడంబరముగా భగవదారాధనాసక్తులై మనుగడ సాగించిన మహనీయులు. వీరు పరుచూరులోని యార్లగడ్డ రామన్నోన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పేరొంది అనేక పండితులను ప్రభవింపజేసిన ప్రతిభాశాలి.

వీరు శ్రీవైఖానస శాఖీయులై భారద్వాజగోత్రులై పరమపవిత్రులైన శ్రీమతి రాఘవమ్మ తాండవ కృష్ణమాచార్య దంపతుల ప్రథమ పుత్రులు. మాతాపితరుల సేవనలో వారి ఆశీస్సులనంది కవితా సామ్రాజ్యమున తాండవమాడిన రంగస్థల రసిక రంగరాజు.

గౌతమ గోత్ర సంజాతయైన పుష్పావతిని ధర్మపత్నిగా బడసి వెంకటరమణ, సత్యనారాయణ,

రామకృష్ణ, లక్ష్మీనారాయణ, మురళీకృష్ణులనెడి కుమారులను, పద్మ, కృష్ణకుమారి యనెడి కుమార్తెలను గని సంతానైశ్వర్య సంపన్నులై సదా సంతుష్టాంతరంగులైనవారీ రంగస్వామి.

కవిరత్నమైన అంబడిపూడి వెంకటరత్నంగారి కవితలను మధుర యాత్రలో ప్రారంభించి శోకశోపచార సంఖ్యలో చివర "గోపీ" కావ్యము వరకు, ఇహ, పర విషయ మథనము గావించి (అమృత) రసగంగ నావిర్భ వింపజేసిన అపర భగీరథులు వీరు.

వీరి రచనయైన 'రసగంగ'కు అక్షరాకృతి నిచ్చి ముద్రించిన వీరి తనయులు సర్వదా ప్రశంసార్హులు. ఆరాధ్య దైవమైన శ్రీ వేణుగోపాలుని జన్మ నక్షత్రమైన రోహిణీ నక్షత్ర యుక్తమైన ఆంగీరస కార్తీక బహుళ విదియ గురువారం 12-11-92న శ్రీవారి సన్నిధిన ఈ గ్రంథావిష్కరణము గావించి ప్రథమ వర్థంత్యుత్సవమును నిర్వహించుట సర్వదా ఆదర్శవంతమైన సత్కృషి. ఇట్లే ప్రతి వర్థంతికి వారి రచనలలో ఒక్కొక్క దానికి పునర్ముద్రణావిష్కరణ కార్యక్రమములు భగవదను గ్రహముచే జరుగగలవని నా విశ్వాసము. ఆచార్యుల వారు శ్రీరంగధాముని సమక్షములో తమ కవితా గానము చేయుచు మమ్మాశీర్వదింతురు గాక. ఓం తత్సత్.

"వైఖానసాగమవాచస్పతి- వైఖానసరత్నాకర"

డా॥ నల్లూరి వేంకట సీతారామాచార్యులు

R. M. P.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అర్చక పరీక్షల సలహా సంఘ సభ్యులు

బాపట్ల

# నవరస తరంగిణి

"మధురకవి" యశశ్శరీరులు బృందావనం రంగాచార్యులుగారు నాకు ప్రియమిత్రులు. సన్నిహితులు స్నేహితులు. సాహితీ ప్రియంభావుకులు. పండిత కవులు. అంతేగాక నాకు సతీర్థ్యులు. ఆయన పద్యాన్నైనా గద్యాన్నైనా హృద్యంగా సహృదయ నైవేద్యంగా నడిపించగల సవ్యసాచి. చక్కని ప్రతిభావ్యుత్పత్తులు గల మనీషి. ఏ కావ్యమునైనా సరే అన్ని కోణాలలో నుండి పరిశీలించి పరిశోధించి గుణదోష చర్చచేసి నిగ్గు తేల్చగల విమర్శకుడు.

ఆంధ్రదేశంలోని కవిరత్నం శ్రీ అంబటిపూడి వెంకటరత్నం. ఆయన కలం పదునైనది. ఆయన కృతులన్నీ ఆంధ్రసరస్వతి నవనవాకృతులు. కచ్ఛపీ శ్రుతులు. ఆయన అచ్చపు తెలుగువాడు. తెలంగాణా ప్రజలు ప్రభుత్వంపై తిరుగుబాటు బావుటా నెత్తిన తరుణంలో తన కలాన్ని కదిలించి కవి కిశోరంగా మాసిపోని వాసి గాంచాడు. గుఱ్ఱాలు దాడి చేసినట్లుగా తన పద్యాలను అదనుచూచి కదను త్రొక్కించాడు. మా సుహృద్వరులు "బృందావనం" వారు ఆ కవి రచనలపై ఒక మంచి విమర్శనాత్మక గ్రంథం వ్రాశారు. అదే "రసగంగ". ఇందులో 'కట్టమంచి' వారి ఒరవడి తొంగి చూస్తున్నది.

"విద్యానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" అను ఆర్యోక్తిని అనుసరించి ఇక్కడ కవి, విమర్శకుడు ఇద్దరూ పండిత కవులే. ఇంకేమి? బంగారమునకు తావి అబ్బినట్లే అయింది. లోకంలో సాధారణంగా కవి హృదయం గాఢంగా గూఢంగా వుండవచ్చు. దాన్ని అరటిపండు వొలిచి పెట్టినట్లు చదువరులకు అందించటం విమర్శకుని విధి.

'బృందావనం' వారు విమర్శకునిగా తన ధర్మాన్ని చాటు మాటులు లేక నీటుగా సూటిగా నిర్వహించారు. పద ప్రయోగ నైపుణ్యాన్ని వివరించారు. ఆలంకారిక శోభలను పొంగో పొంగంగా తేటతెల్లం చేశారు. కవిగారి సామాజిక స్ఫూర్తిని స్పష్టం చేశారు. కవి కోరిన జగద్ధితాన్ని ధీమాన్యులకే కాక సామాన్యులకు కూడ అందించారు. ఖండ కావ్యాలలో నున్న వివిధ శీర్షికలలోని భావాలు రచయిత హృదయానికి ప్రతీకలనీ అవే వారికి కీర్తి పతాకలనీ నిరూపించారు. రస గంగా భగీరథులనిపించుకొన్నారు.

సృష్టి అంతా కాలగర్భంలో కలిసిపోక తప్పదు. కాని కవులకు విమర్శకులకు మాత్రం జరామరణాలు లేవు. వారు చిరంజీవులు. ఆచంద్రార్కం ప్రజల నాలుకల మీదనే జీవిస్తారు. వారి బంగారుపలుకులు పలుకులతల్లి కులుకులు. పంచదార చిలుకలు. ఈ రసగంగా పానం చేసిన వారు వెంకటరత్నంగారి కవితను చవి చూడ నక్కర లేదు. ఈ గ్రంథం నేటి కావ్య విమర్శకులకు మార్గదర్శకం కాగల దని ఆశిస్తున్నాను. 'బృందావనం' వారి విమర్శనా పాట వానికిది గీటురాయి అని భావిస్తున్నాను. ఆంధ్ర కవితా శారదకు కలికితురాయి అని విశ్వసిస్తున్నాను. శాశ్వతముగా కన్నుమూసి వైకుంఠ పదము నందిన పితృదేవుల యీ రచనను శ్రద్ధాసక్తులతో ముద్రణ చేయించిన చిరంజీవి శ్రీమాన్ బృందావనం వేంకట రమణాచార్యులను వాని సోదరులను మనసార అభినందిస్తున్నాను.

శుభమ్ భూయాత్

ప్రతాప వేంకట సుబ్రహ్మణ్యము
తెలుగు లెక్చరర్
V. R. S. & Y. R. N. కాలేజి, చీరాల

# అభీష్టము

శ్రీమాన్ బృందావనం రంగాచార్యులుగారు మాకు గురువులు. తెలుగు భాషలో సౌకుమార్యాన్ని చవిచూపిన మరువలేని మధుర కవి. భారత, భాగవత, హరివంశములలో యున్న కృష్ణ తత్త్వాన్ని గ్రహించి అంబటిపూడి వెంకట రత్నముగారు వ్రాసిన గ్రంథములపై సమీక్ష సల్పి విమర్శనాత్మకంగా 'రసగంగ'ను సులభశైలిలో అందించిన గురుదేవులకు యావత్ రస హృదయులు కృతజ్ఞతలు చెల్లించవలసియున్నది. ఈ గ్రంథ ముద్రణకు తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆర్థిక సహాయము అందించుట ముదావహము. ముద్రణకు ముందే వారు స్వర్గస్థులగుట మా వంటి వారికి ఎంతో బాధను కలిగించినది. వారి కుమారులు ముద్రణా రూపము కల్పించుట వారి పితృభక్తికి నిదర్శనము. 'రసగంగ' మూల పురుషుడైన ఆ కృష్ణ పరమాత్మ ఆ చిరంజీవులకు సుఖ, శుభములు యిచ్చుగాక. మా గురుదేవులకు ఆత్మశాంతి, వైకుంఠప్రాప్తి కలుగునట్లు భగవంతుని ప్రార్థిస్తూ యున్నాను.

బోబోలు రాధాకృష్ణమూర్తి
సెక్రటరీ & కరస్పాండెంట్
**B. A. R.** జూనియర్ కళాశాల, పరుచూరు

# ఆకాంక్ష

మధురకవి కీ॥శే॥ బృందావనం రంగాచార్యులుగారు నాకు గురువర్యులు. సాహిత్య రంగంలోనే కాక, బోధనా రంగంలో కూడా పండిన అనుభవము వారిది.

వారి చివరి గ్రంథము రసగంగ వారి సమీక్షాత్మక దృష్టికి చక్కని నిదర్శనము. కాలగర్భంలో కలసిపోయిన అంబటిపూడి వెంకటరత్నంగారి గ్రంథాల్ని వెలికి తీసి సాహిత్యలోకానికి అందించిన ఘనత వారికే దక్కుతుంది. వారు చనిపోయినా - ఈ గ్రంథాన్ని ముద్రించి పాఠకలోకానికి అందించిన వారి కుమారుల కృషి ప్రశంసనీయము. శ్రీరంగాచార్యుల వారికి ఆత్మశాంతి - విష్ణులోక నివాసము లభించాలని కోరుతూ, వారి కుటుంబీకులకు నా ఆశీస్సులు తెలుపుతున్నాను.

యం. రామమోహనరావు M.A., M.Ed.
ప్రిన్సిపాల్
బి. ఏ. ఆర్. జూనియర్ కళాశాల, పరుచూరు

# ధన్యజీవి

రసగంగ రచనతో మా రంగనాధుడు పుంభావ సరస్వతి యైనాడు. వేణుగోపాలుని సన్నిధి జేరిన రంగనాథా నీవు ధన్యజీవివి నాయనా!

" అలంకార కళాప్రవీణ - స్వర్ణ ఘంటా కంకణ విభూషిత "
శ్రీనివాసుల పార్థ సారధి అయ్యంగారు, బ్రాహ్మణ కోడూరు.

---

# నమస్సుమాలు

మా గురుదేవులైన శ్రీమాన్ కీ॥ శే॥ బృందావనం రంగాచార్యులుగారు సారస్వత లోకములో మణిపూసవంటి వారు. వారి మరణము అశనిపాతము వంటిది-శిష్యునిగా 40 సంవత్సరముల అనుబంధము మాది. షుమారుగా 40 గ్రంథములను వ్రాశారు. వారి రసగంగ - సమీక్షాత్మక కావ్యము. అందులో వారికిష్టమైన కృష్ణతత్వాన్ని విశ్లేషించి చెప్పుట జరిగినది. ఆ భగవానుడు వారి ఆత్మకు శాంతి కలిగించుగాత.

గోరంట్ల వీరయ్యచౌదరి B. A. B. L.
వీర్నపాలెం, ప్రకాశంజిల్లా
మాజీ మండలాధ్యక్షులు, పర్చూరు మండలం

# అంజలి

విశ్వవర్ధనమైన విద్యాధనాన్ని సాధించిన శ్రీమాన్ బృందావనం రంగాచార్యులుగారు ఆ విద్యను సార్థకం చేసుకొనేందుకు దైవానుగ్రహాన్ని పొందేందుకు రసజ్ఞతతో " గుహుడు " మొదలయిన భక్తిరస కావ్యాలు వ్రాసి పునీతులయ్యారు.

వారు పౌరాణిక కావ్యాలు వ్రాయటమే గాక అన్యులు వ్రాసిన కావ్యాలలోని రసోత్కర్షను ప్రత్యక్షముచేసి ఆయా కావ్యాల కీర్తి సౌరభాలను దిగంతాల వరకూ వ్యాపింపజేశారు.

అంబటిపూడి వెంకటరత్నంగారు వ్రాసిన కావ్యాలపై శ్రీ ఆచార్యుల వారు వ్రాసిన సమీక్షావ్యాసం వారి నిశిత పరిశీలనా శక్తినే కాక కృతికర్తల ఆంతర్యాన్ని గూఢ వెలువరించేందుకు సహాయపడింది. వేంకటరత్నంగారి కావ్య త్రివిష్టపంనుండి రసగంగను. ఆంధ్ర పాఠకలోకానికి అందించిన అపరభగీరథులు శ్రీ ఆచార్యుల వారు —

శ్రీమాన్ రంగాచార్యులుగారు మాకు మేనమామ లగుట మా పురాకృత సుకృత విశేషమే గాక వేరుగాదు. వారితోపాటు సహోపాధ్యాయులుగా జీవికను దాదాపుగ వింశతివత్సరాలపాటు గడుపుట మాకు అందివచ్చిన అదృష్టము,

వారి కావ్యాన్ని అచ్చొత్తించిన మా మేనల్లుళ్లు చిరంజీవి రమణాచార్యులు సోదరులు పితౄణము తీర్చు కొనుటలో కృతకృత్యులయినారు. వారికి ఆయురారోగ్యము లనిచ్చి కాపాడగలందులకై శేషాచలవాసుని ప్రార్థిస్తూ - విష్ణుసాయుజ్యం చెందిన మా మామయ్యకు అంజలి ఘటిస్తూ —

దీవి అనంతశయనమ్ M.A.
శ్రీనివాసమూర్తి M.A.
తెలుగు పండితులు
Y.R. హైస్కూలు, పరుచూరు

# నా ఆశయము

కీ॥ శే॥ రంగాచార్యులుగారు నాకెంతో ఆప్తులైన గురుదేవులు - వారి మరణం - మిత్రులు కొల్లాసుబ్బాగారి మరణం - నన్నెంతో దుఃఖితుడిని చేశాయి వారి ఆత్మ లకు శాంతి గలుగు గాక! రసగంగ రచన - ఆచార్యుల వారి కీర్తిని చిరస్థాయిగా నిల్పాలని నా ఆశయము.

ముప్పాల అప్పారావు
ప్రొప్రయిటర్: గోపాలకృష్ణ రైస్‌మిల్,
సుబ్రహ్మణేశ్వరస్వామి, పుట్టఆంజనేయస్వామి,
దేవాలయ ధర్మకర్త - పర్చూరు

# అభివాదము

"రసగంగ" ఇతి వృత్తము, భాషా సరళి, గురువుగారు రంగాచార్యులుగారి చేతిమలుపు వీటిపై వ్యాఖ్యకు నేను సుదూరము. మిత్రుడు సాహితీ సహకార మందించ మనగానే సంతోష పడ్డాను. రసగంగ విషయంలో సమయాన్ని, శ్రమను హెచ్చించి కృషిచేశారు రంగాచార్యులుగారు, నా M.A. తెలుగు పట్టానికి, నా ఉపాధ్యాయ వృత్తి దీప్తి చెందటానికి అదే వరవడిలో నాకు సహకారం అందించారు గురువుగారు. అస్తిత్వ పోషణకు దృఢ సంకల్పంతో కృషి సల్పినట్లే నాకు హేతువాద తత్వాన్ని అధ్యయనం చేయటానికి, మార్క్సిజం వంటబట్టటానికి కావల్సిన ప్రాథమిక కవితా పాఠవాన్ని నా కందించారు. భాషపై పట్టు ఆయనకు అపారం కనుక "రసగంగ" గొప్పతనం వ్రాయటం అనవసరం. గురువులు, సాహితీప్రియులు, సదా నా అభివృద్ధిని కాంక్షించిన వారు రంగాచార్యులు గారు, 'రసగంగ' సందర్భంగా స్మృతి పథంలో ప్రత్యేక రూపంలో మెదిలారు. వారి ఆలోచనా విధానాన్ని ముందుకు మోసుకెళ్తూన్న వారి కుమారులు చిరంజీవులు రమణాచార్యులు, సోదరులు అభినందనీయులు.

క్రిష్ణంశెట్టి కనకయ్య, యం. ఏ.
తెలుగు పండితులు
Y.R. హైస్కూల్, పరుచూరు

# ప్రశంస

ఆంధ్ర సాహిత్య సాగరమునకు ఇతర కవితాగంగ లతో పాటు దీటుగా ప్రవహించినది కీ॥ శే॥ బృందావనం రంగాచార్యుల వారి 'రసగంగ'. శ్రీ అంబటిపూడి వెంకట రత్నముగారి కావ్య గంగను హిమోన్నత శిఖరాలపై భక్తితో కూర్చుండ బెట్టినారు శ్రీ రంగాచార్యులుగారు. అందుండి జాలువారినదే 'రసగంగ'. మనిషి గొప్ప తనమును మరొక మనిషి చెప్పిన తెలియును. కవి హృద యము కవిజెప్పిననే బాగుగా తెలియును. భక్తులు కొనియాడని యెడల భగవంతుడు ఎట్లు గొప్పవాడగును!

శ్రీ వెంకటరత్నముగారి సాహిత్య ప్రతిభను తరచి తరచి జూచిన పోకడ ఇందు కనపట్టును. అంతయూ సలక్షణమే. ఒకరు స్రష్ట మరొకరు ద్రష్ట.

ఈ సమీక్షా రచనలో స్వేచ్ఛగలదు. సహజత్వము గలదు, సంప్రదాయము గలదు. అన్నిటిని మించిన మాధుర్యము గలదు.

శ్రీ రంగాచార్యులు వారి సాహితీ బృందావనమున వెల్లివిరిసిన ఈ 'రసగంగ' వారి పరిణతి చెందిన రచనా కౌశల మును చాటి చెప్పుచున్నది. నిజముగా వారు మధుర కవులే.

తాను స్వర్గమున "అమృత గంగ"ను గ్రోలుచున్న కీ॥ శే॥ మధురకవి బృందావనం రంగాచార్యులువారు ఆంధ్ర సాహిత్య పఠన పిపాసకులకు "రసగంగ"ను తనివిదీర ప్రసాదించి ధన్యజీవి యైనారు. దీనికి ముద్రణా రూపమును కలిగించి వారి కుమారులు చి॥ వెంకట రమణాచార్యులు పితృ ఋణము తీర్చుకున్నారు.

జి. రామారావు M.A.(Tel); M.A.(Eng); MEd
ప్రధానాచార్యులు, ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల, నిమ్మకూరు

# అక్షర ప్రసూనాలు

ఇది " మధురకవి " కవితా బృందావనం !
సుమధుర కృష్ణతత్వ వ్యాసనందనం !!
తీయ తేనియలూరు
అమృతవచన వాహిని
తెలుగు ఎదలలో నిత్యం
వెలుగు నింపిన దివ్యజ్ఞాని !
సాహితీ నందనవనంలో
చక్కని కవితా రస ఆమని
రమ్యమైన కోకిల కంఠధ్వని
రంగాచార్య ప్రతిధ్వని
కృష్ణతత్వ అక్షర ప్రసూనాలు
తృష్ణ దీర్చెడి కవితా రసాలు
రంగాచార్య మనోభావాలు
రంజిల్లె రసగంగ తరంగాలు.
జాలు వారిన చివరి కవిత
జనత కందించిన కృష్ణతత్వగాధ
మధుర కవి అక్షరాలకిది ఆకృతి
సుధలై వర్షించు ఆత్మ శాంతి
ప్రేమ నిండిన పిల్లల మనోరధం
పితృ దేవుని కందించు నీరాజనం
సమాదరించు సాహితీ జగతి !
చక్కనిదీ రసగంగ అక్షరాకృతి !!

దీవి రంగాచార్యులు M.A, B.Ed.
జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత
ప్రభుత్వ పాఠ్య పుస్తక రచయిత

దీవి హనుమాచార్యులు RMP (హోమియో) స్వర్ణ

కుదరవల్లి జోగి వెంకట రామాంజనేయ
దుర్గావర ప్రసాద్, B. Com.
మేనేజింగ్ డైరెక్టరు: చైతన్య ఆయిల్స్ లిమిటెడ్
కురుమద్దాలి, పామర్రు మండలం.

గౌరవనీయులైన శ్రీమాన్ రంగాచార్యుల వారు మాకు చిరపరిచితులు - వారి కుమారుడు శ్రీ B. V. రమణాచార్యులుగారు - మా పాఠశాలలో ఉపాధ్యాయులుగా పని చేయుచున్నారు.

శ్రీ రంగాచార్యులుగారు — మా నిమ్మకూరు వెంకటేశ్వరస్వామి వారి దేవస్థానమునకు ఆస్థాన పండితునిగా ప్రతి సంవత్సరము వచ్చి బ్రహ్మోత్సవములలో పాల్గొని ఆధ్యాత్మిక కార్యక్రమములను నిర్వహించి మాకెంతో ఆనందమును, భక్తి భావనలను కలిగించినారు.

వారి మరణం మాకెంతో తీరని లోటు. వారి చివరి గ్రంథము రసగంగ ను చదివినాను - కృష్ణ తత్వములను చక్కగా వర్ణించినారు.
మా వెంకటేశ్వరస్వామి వారి ఆత్మకు శాంతి కలిగించు గాక.

కె. ప్రసాదు M. D.

---

## అభివందనము

మా తండ్రిగారి మీద గల ప్రత్యేకాభిమానముతో - రసగంగపై తమ అభిప్రాయముతోపాటు గ్రంథ ముద్రణకు రు. 1000-00 లు ఆర్థిక సహకారము నందించిన సహృదయులైన సాహితీ మిత్రులు శ్రీకుదరవల్లి ప్రసాదుగారికి మా కుటుంబ పక్షమున హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములను తెలుపుకొనుచున్నాను.

బి. వి. రమణాచార్యులు

## సుకృతులు

శ్రీ బృందావనం వెంకట రమణాచార్యులుగారికి, సమస్సుమాంజలులతో వ్రాయు లేఖాంశములు. మధురకవి మీ నాయనగారి మరణ వార్త విని ఖిన్నుడనైనాను. వారి సుందర స్ఫుర ద్రూపము నా కనుల ముందున్నట్లైనది. వారి కంఠము చెవులలో నినదించినది. వారి లేఖిని నుండి వెలువడిన రసగంగ జాలువారినట్లైనది-వారి శైలిలోని ఒక ప్రత్యేకత బృందావనంలో విహరించినట్లైనది - వారి వాక్ఝురి మోకులు పట్టి లాగినను ఆగనిది - వారి కవితా శైలి, విన్యాసములు మరపురానివి. రసగంగ ముద్రణతో మన పితృదేవులు-ఇరువురు-ధన్యులైనారు. శ్రీ రంగాచార్యులు గారు-ఈ సమీక్ష ద్వారా-మా తండ్రిగారిని తిరిగి సాహిత్య లోకములో చిరంజీవులను గావించారు. ఇరువురు కృష్ణైక్యము నొందిరనుటలో సందేహము లేదు. "రసగంగ"ను ఎంతో ఓర్పుతో త్వరగా ముద్రణ గావించిన మీ కృషికి పితృభక్తికి నా ధన్యవాదములు.

**అంబటిపూడి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి M.A., B O L**
తెలుగు పండితులు, మిర్యాలగూడ

---

## ధన్యవాదములు

కోరిన వెంటనే తమ తండ్రిగారైన శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారి రచనలను-ఇచ్చి సమీక్షకు అనుమతిని, అనుభూతిని అందించిన వారి కుమారులైన శ్రీ అంబటిపూడి వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారికి దివ్యశ్రీ రంగాచార్యుల వారి ఆశీస్సులు తప్పక వుంటాయి. అనేక విధములుగా ఈ గ్రంథ ముద్రణ విషయములో మాకు సహకరించి ప్రోత్సహించిన-వీరికి మా కుటుంబ పక్షమున హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

బృందావనం సోదరులు



శ్రీ ర్వి జ య తే

# రసగంగ

" సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్. "

మంచి కవిత వ్రాయగల్గిన పనితనము హస్తగతమై యున్నప్పుడు రాజ్యముతో పనిలేదు.

వాస్తవమే. కవితా సామ్రాజ్యాన్ని సాధికారముగా-పరిపాలించే కౌశలముగలవారికి తదితర సామ్రాజ్యాల పరిపాలనా ప్రసక్తి పట్టదు.

వాఙ్మయనందనంలో విశృంఖల విహారము గావించుచు పదసంపదమీద తిరుగులేని పెత్తనాన్ని చెలాయించుచు మధురభావాశ్వాలు పూన్చిన కవితారథాన్ని నడిపించు కవిసార్వభౌముడు మరొకవిధమైన సార్వభౌమత్వాన్ని అభిలషించడు. ఆశించడు.

చక్రవర్తుల ప్రతిభ శాసించినంతకాలమే చెల్లుతుంది. బలాఢ్యుడైన పరప్రభువు; పైకి లంఘించినా—పరిస్థితుల అననుకూలతవలన ప్రజలు తిరుగుబాటుచేసినా—చరిత్ర గతి తల్లకిందులు కావడం తథ్యము.

కవిచక్రవర్తి విషయ మట్టిదిగాదు. ఒక మహా కావ్యరచనతో రసజ్ఞ పాఠకుల గుండెలమీద అభిమాన సింహాసనాన్ని అధిష్ఠించిన కవినాథుని ఉనికికిగాని మనికికి గాని చలనమే లేదు. పీఠాధిపత్యము జారిపోవునను శంకలేదు. ప్రేమాభిమానాలు కరగునో! మరగునో! యనెడి జంకులేదు.

మహాకవులపట్ల యేర్పడిన గౌరవాభిమానాలకు క్రమ క్రమ పరిణామదశలో ఉన్నత స్థాయియే లభ్యపడుట సహజము. చరిత్ర నిరూపించుచున్న సత్య మిది.

"కవిని గన్న తల్లి గర్భంబు ధన్యంబు"

మొదలయిన ఆణిముత్తెములవంటి సూక్తులతో కవిప్రతిభ సర్వదా నిరూపింపబడుచునే యున్నది. నిరూఢ స్థితి నందుకొనుచునే యున్నది.

"కవి నిత్యుండు కవిత్వ మెప్పుడును లోకక్షేమమే ధ్యేయమై
అకలంకంబుగ సాగు గంగ—"

ఈ నిత్యత్వము రాజాధిరాజులకు లేదు. కావుననే కవిరాజు కావ్యప్రపంచ భావ సామ్రాజ్యములపై మొక్క బోవని యధికారమును నెరపినాడనియు, జరుపుచున్నా డనియు, కొనసాగింపగలడనియు, కంఠోక్తిగ జెప్పబడినది.

ప్రాచీనకాలమున భూపతుల మర్యాదలనందుకొని త్రికాల సత్యముల నుద్బోధించెడి సార్వజనీన దృష్టిగల మహాకవు లెందరో! మనకు సాహిత్య గగన సీమలలో ధ్రువతారలై సాక్షాత్కరించుచుందురు.

ప్రభువుల సహకార సానుభూతులకు నోచని, ఆధునిక కాలమున గూడ కవితావాహినికి అడ్డుకట్టలు వేయు టెవ్వరికిని సాధ్యము గాలేదు.

హిమాలయ శిఖరసీమ నుండి పొంగులతో భూతలానికి దూకుతున్న గంగ నాపివేయగల శక్తి యెవ్వరికి కలదు ?

అట్టి ప్రయత్న మాచరించువానిని ఉన్మాదియన వలసినదే. మతిభ్రమణ గలవాడు తప్ప—ఇట్టి యవివేకపు చర్యకు మరొక్కడెట్లు సాహసించును ?

19వ శతాబ్దమున ఉత్తరార్థమునుండి తెలుగు గడ్డమీద కవితకిట్టి గడ్డు పరిస్థితు లేర్పడినమాట యథార్థమే కావచ్చును. కాని ! నేలకు గొట్టబడిన బంతి మాదిరి తెలుగు కవితా మహోద్యమాన్ని నీరసపరచేదానికి విదేశ ప్రభువులు గట్టిచర్యలు గైకొనిన కొలది—తెలుగు కవిత ఉవ్వెత్తుగ పైకి లేచినది. ప్రాభవమును చూపించినది. ప్రశస్తిని గడించినది. భూగర్భమునుండి రివ్వున దూసుకొని వచ్చుచున్న మధుర జలధారల యూటను నిలిపివేయుట యెవ్వరికిని సాధ్యము గాదు. పరిసరాలను శీకరాంబుకణ పంక్తులతో మెత్తబరచుకొని రసార్ద్రమొనర్చుకొని విశ్వ రూపమును జూపుచు వెల్లువగా బయటికి తప్పక పరుగులు దీయగలదు.

పాశ్చాత్యుల పరిపాలనా కాలమున తెలుగు కవిత స్థితి యట్లుండె ననుట అతిశయోక్తి గాదు. ఆ ఊపులో రూపుదాల్చిన యెన్నో కావ్యరాజములు నాడు రసజ్ఞుల నలరించినవి. ఎందరో రసాత్మక హృదయులగు కవి చంద్రులు ముగ్ధమోహన భావదీప్తులతో వెండి వెన్నెలలను వర్షించారు. పాలకుల సమాదరణము సున్నగానున్న సమయమున గూడ ఆంధ్రకవితాగంగను తెలుగువారి గుండెలమీదుగా, దండిగా, ప్రవహింపజేసి ప్రతిభావంత మైన సాహిత్య వ్యవసాయాన్ని సాగించారు. బంగారు పంటలను పండించారు.

ఆ కోవలో 20వ శతాబ్దపు రెండవ భాగంలో ఆంధ్ర సారస్వత సేవారంగముమీద కాలుమోపిన కమనీయ కవితా దృష్టిగల వ్యక్తి అంబటిపూడి వెంకటరత్నముగారు.

ఆయన జన్మించినది అవిభక్త గుంటూరు మండలానికి చెందిన అన్నంభొట్లవారి పాలెము సమీపమున గల ఏదుబాడు గ్రామంలో అయినా—ఆయన సారస్వత సేవాభాగ్యాన్ని అందుకొనడానికి మాత్రం తెలంగాణా ప్రాంతం నోచుకొన్నది—అదొక విచిత్ర విషయము. గంగ పుట్టినచోట ప్రయోజనం అనుభూతికి అంతగా అంది రాదేమో ! అది విశ్వరూపంతో విజృంభించి విహరించి మెట్టిన ప్రతి ప్రాంతాన సువర్ణాభిషేకం చేస్తుంది.

వెంకటరత్నంగారి కావ్యగంగ ఆ మాదిరిగా ప్రవహించింది. అంబటిపూడి వంశం ఆదినుండి మేధావు లకు ఆలయంగా ఉంటూ వచ్చినమాట—అక్షరాక్షర సత్యమే—అయినా అందులో మణిదీపముగా దివ్యచ్ఛట లను ప్రసరింపజేశారు వెంకటరత్నముగారు. వారిది మధ్యతరగతికి జెందిన సంపన్న నైష్ఠిక బ్రాహ్మణ కుటుంబము. బాల్యంలో పెరిగిన ప్రాంతం పూర్తిగా విజ్ఞాన సముపార్జనకు దోహదమిచ్చేదిగా లేదు. భారత దేశంలో అట్టడుగున పడివుండి కనీసావసరాలకు గూడ మొగము వాచిన సగటు పల్లెటూరు స్థాయికి చెందిన గ్రామమే—ఏదుబాడు.

కాని, ఏ గురుదేవుడను గ్రహించాడో! ఏ సుముహూర్తము కలిసి వచ్చిందో! వెంకటరత్నము గారు విద్వత్కవికులతిలకుడు కాగలిగాడు.

"ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః"
అన్న కాళిదాసు కవిసూక్తి అక్షరాక్షర సార్థకము గదా!

తెలుగుతల్లి గళసీమయందు అలంకృతాలై కమనీయ రమణీయ హారములో పొదుగబడ్డ అసంఖ్యాక రత్నాలన్నీ పల్లెసీమలనుండి ప్రోదిసేయబడినవాని వలెనే కనిపిస్తాయి. ఈ యదార్థాన్ని చరిత్ర వెయ్యి కంఠాలతో వివరిస్తూనే వుంది.

ఏ మహాదృష్టమో కలిసివచ్చి ఏదుబాడు, మహాకవి వెంకటరత్నంగారిని, కడుపారగని సర్వాంధ్ర ప్రజానీక సేవకు సమర్పించుకొన్న నేలగా మన్ననలు పొందగల్గింది. ఏదుబాడు మొదటినుండి అగ్రహారమే. ఎవరికి ఎవరు ఎందుకీ అగ్రహారాన్ని అందించారో! అగ్రహారం మాత్రం విజ్ఞాన కాంతిపుంజాలను—పూర్వకాలమునుండి వర్షిస్తూనే వున్నది. ఇరవయ్యవ శతాబ్దపు ఉత్తర భాగంలో గూడ శారదాపుత్రులు పలువురిచట జన్మించారు. ప్రముఖులుగా కీర్తి గడించారు. ఆ శ్రేణిలో యీ తరానికి కొలికిపూస వెంకటరత్నంగారు.

అక్షరాభ్యాసం ఏ పుణ్యపురుషుని సన్నిధిలో చేశారో! గ్రంథపఠనాసక్తిని ఏ మహాత్ముని సూచనలతో పెంపొందించుకొన్నారో! తెలుగు పదాల సొగసులలోగల వెలుగు జిలుగుల నెట్లవగతము చేసికొనగలిగారో! గంభీర జలధి సదృశమైన కావ్యగర్భమునగల భావమాణిక్యాల నేరీతి యన్వేషించి స్వవశమొనర్చుకొనగలిగారో!

లాక్షణికశక్తి యెట్లలవడినదో! ఛందోబంధములతో నేపగిది పొందు కుదిరినదో! రసాలంకారశాస్త్ర నిష్ణాతృత్వ మెట్లబ్బినదో! వ్యాకరణ పరిజ్ఞానమేరీతి వలచివచ్చి వరించినదో! సరసము, సముచితము, సహృదయ హృదయాహ్లాద సంధాన దక్షము అయిన తాత్త్వికధోరణి ఎట్లు కైవసమైనదో! మనోజ్ఞశైలీ మాధుర్యధుర్యమైన

కవితావైఖరిని కనుసన్నల నడయాడజేయు ముగ్ధమోహన సాహిత్య పాండిత్య మెట్లబ్బినదో! జీవితచరిత్ర స్రష్టలు సంగ్రథించి వ్రాయవలసిన అంశములు—పలుకుగల పలుకుపై అధికారము నెరపెడి యదృష్టవంతుడైనా డాయన. ఆంధ్ర సరస్వతీ పదపీఠిచెంత లలితలావణ్య మును సంతరించుకొన్న ప్రథితభావ సురభిళ ప్రసూన పరంపరలను శ్రద్ధాభక్తులతో సమర్పించుకొని నిజమైన సంతృప్తితో నూపిరిపీల్చుకొనజాలిన సారస్వతార్చకుడు కాగలిగినాడాయన.

తల్లి దీవెనలు మల్లెలై మొల్లలై ఆయన నలరించి నవో! తండ్రి శిక్షణ కలిసివచ్చిన మహాభాగ్యమై ఆయనను మహోద్దండ పండితకవిగా మలిచినదో! గురుదేవుని నిరుపమ దరహాస పరిపూర్ణ కరుణా రసధార చిరకాల తపఃఫలమై ఆయన శిరస్సుమీద వాఙ్మయామృతాభిషేక మాచరించి నదో! సహధర్మచారిణి నోచిన ఏ నోముల పంట ఆయన యింట నవ్యకావ్యసంపదలకు పురులు పెట్టించినదో! నెచ్చెలికాని ముచ్చటయిన యోచనాబలముతో మైత్రీ ధర్మమహిమతో, ఆయన కృషి పచ్చ పచ్చగ పకలాడుచు నిత్యశోభలతో పరవశించినదో! ఏమో! వెంకటరత్నము గారు ప్రాజ్ఞుడైన రసజ్ఞుడైనాడు. పండితకవియైనాడు. భావుకుడైనాడు. పుంభావ సరస్వతిగా ప్రశంస లందుకొనినాడు.

ఆయన కావడానికి బి. ఏ. పట్టభద్రుడు. కాని సాగించిన కృషి—చేసిన పరిశోధన—సలిపిన సృష్టి—ఆర్ష విద్యకు, సంప్రదాయానికి, సంబంధించినట్టిది. భారతీయ తత్త్వశాస్త్రముపట్ల వెంకటరత్నముగారికి గల భక్తిప్రపత్తులు వారు వ్రాసిన ప్రతి గ్రంథంలో, ప్రతి ఖండికలో, ప్రతి పద్యంలో, ప్రతి వాక్యంలో, ప్రత్యక్షరంలో ప్రతిఫలిస్తుంటాయి.

ఆయన విద్యా విజ్ఞాన విశేషాన్ని—తపస్సుగా సాధించారు. కవితాతత్త్వ రహస్యాన్ని అమృతంగా ఆస్వాదించారు. కావ్యనిర్మాణాన్ని హేలగా కొనసాగించారు. విద్యావేత్తగా, పండితుడుగా ఆయన యెంత ఘటికుడో, కవిగా, సరస సారస్వత స్రష్టగా ఆయన అంత సౌమ్యుడు, సహృదయుడు, సరసుడు. వ్యక్తిగా ఆయన యెంత ఉన్నతుడో : మిత్రుడుగా ఆయన అంతటి ఉదాత్తుడు. ఉత్తమోత్తముడు.

తెలంగాణా జిల్లాలు, నిజాం ఏలుబడిలో మ్రగ్గుతున్న కాలమది. ప్రబుద్ధ ప్రజావాహిని విముక్తికొరకై నిజాం ప్రభువుమీద తిరుగుబాటు సాగించుచున్న రోజులవి. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము వంటి గ్రంథాలయాలద్వారా ; గోల్కొండ వంటి పత్రికల ముఖతః మాత్రమే ఆంధ్రోద్యమము పుంజుకొని నాడు వికాసదశనందుకొనెడి అవకాశాలు కనిపించుచున్నవి. ఆంధ్రభాషా సరస్వతీ చరణసేవకు కావలసినంత పత్రిని

పుష్కలముగ నందింపగల ఉద్దండ పండితులున్నారు. కాని వారికి గుర్తింపుగాని ; తగినంత సహకారముగాని ; ప్రోత్సాహముగాని లభ్యపడని వాతావరణమే నాడు నిజాం రాష్ట్రమున నలుమూలల వ్యాపించియున్నది.

దేశభక్తులు, తెగువతో కృషిసాగించుచున్నను, ఫలితములు ఆశాజనకములుగ గనిపించని కాలమది. వెంకటరత్నముగారు—అట్టి పరిస్థితులలో అధ్యాపకుడుగ తెలంగాణమున అడుగుపెట్టారు.

"విద్యయశస్సు భోగకరి విద్యగురుండు
విదేశ బంధుడున్." అని గదా సూక్తి.

అచిరకాలముననే తెలంగాణా ప్రజానీకానికి ఆయన ప్రేమపాత్రుడయ్యాడు. మధురకవితలతో మనస్సు నాకర్షింపజాలినశక్తి వెంకటరత్నముగారికి కలదు. మంచి హృదయముగల మహావ్యక్తిగూడ నగుటవలన ఆయన కొలదికాలమునకే తెలంగాణమున గొప్ప పండితుడుగా గౌరవ భాజనుడయ్యాడు.

ఎందరో మిత్రులు ; ఎందరో ఆప్తులు, ఎందరో శిష్యులు : — చదువులతల్లి దయయున్న సమకూరని దేమి గలదు ?

తెలంగాణమున గల సారస్వత సంస్థల కన్నింటికిని వెంకటరత్నముగారు ప్రియబంధువయినారు. క్రమ

క్రమముగా తెలంగాణా సారస్వతోద్యమము వారి జీవిత ములో ప్రధాన భాగముగా పరిగణింపబడెడి స్థాయికి వారు చేరుకొన్నారు. వెంకటరత్నముగారి కవితాగానము తెలంగాణము నలుమూలలకు వ్యాపించింది. అదే సమయాన నిజాం సంస్థానాధిపతికి సర్వతంత్ర స్వతంత్ర ప్రభువుగా వ్యవహరించవలె ననెడి సంకల్పము గూడ బలపడింది. దుష్టశక్తుల ప్రోత్సాహము—ఆ సంకల్పాన్ని బాగా గట్టిపరచింది.

పైశాచిక శక్తుల "వత్తాసు"తో నిజాం నవాబు పైలా పచ్చీసుగా వ్యవహరించుటారంభించాడు. ప్రజా జీవితము భగ్గుమన్నది. జాతీయభావాలు గల వ్యక్తులపై నిఘా అధికమై క్రూరముగా—దారుణముగా—మారి కూర్చున్నది. మొత్తముమీద తెలంగాణా ప్రజల జీవిత సౌభాగ్యముతో నిజాం ప్రభువు—ఆటలాడుకొనెడి దశకు వచ్చాడు. అరెస్టులు దోపిడీలు, దౌర్జన్యకాండలు; మతాంతరీకరణలు—నిత్యకృత్యాలుగా మారాయి. సామాన్య ప్రజల జీవిత వ్యవహార సరళి భయానకముగ తయారైనది. మతశక్తుల విహారకేంద్రాలుగా తెలంగాణా జిల్లాలు పరివర్తన చెందాయి. తెలంగాణాలో తెలుగువారి బ్రతుకులు బజారున కెక్కడము జరిగింది. గుప్పిట ప్రాణాలు బెట్టుకొని గుట్టుచప్పుడిగాని తెరగున తప్పించుకొని—తలదాచుకొనుటకై తెలంగాణపు తెలుగువారు సర్కారు జిల్లాలకు వలసరాక తప్పలేదు. విధిలేక

వెంకటరత్నముగారు గూడ ఆ సందర్భములో మరల జన్మస్థలమైన "ఏదుబాడు" చేరారు.

విజ్ఞాన పిపాసువులు క్షణకాలము గూడ విశ్రాన్తి గోరరు. కావుననే ఏదుబాడులోనున్న సమయమున గూడ గోళ్ళు గిల్లుకొనుచు వెంకటరత్నముగారు కాలక్షేపము సేయలేదు.

సమీపమున గల పాలపర్తి గ్రామములో నారసింహ హైస్కూలునందు తెలుగు బోధించుటకు సమ్మతించి అధ్యాపకవృత్తిలో ప్రవేశించారు. తెలంగాణమునందు— కల్లోలాలు సమసి—వల్లభాయిపటేల్ గుండెదమ్ముతో నైజాం గద్దెమీద భారత పతాక నెగురవేయువరకు—వెంకటరత్నము గారు పాలపర్తి హైస్కూలులోనే పనిజేశారు. వారెచట నున్న నేమి? సర్వవేళల సరస్వతీ పూజయే? వారెట్లొనర్చిన నేమి? సర్వము సంస్కృతిని సర్వతో ముఖముగ పెంపొందించుటకే మండలాంతరాలలో గూడ పరిమళాలు గుబాళించిన ఆయన మైత్రీబంధానికి కట్టుబడి— కాలము కలిసిరానివేళ—యెందరో తెలంగాణావారు కుటుంబాలతో ఏదుబాడుకు తరలివచ్చి కాపురాలు బెట్టి కలిసి మెలిసి జీవితాన్ని కొనసాగించిన ఘట్టము జ్ఞప్తికి తెచ్చుకొంటే మన మనస్సు ఆర్ద్రముగాక తప్పదు. ఆ సందర్భములో ఆయన వలస వచ్చినవారిపట్ల చూపిన ఆత్మీయత; ఆప్యాయత; మరువరానివి. ఇప్పటికీ; — అంతేకాదు. ఎప్పటికీ గూడ ఆ కుటుంబాలవారు కనులు

చెమర్చుచుండగా యీ విషయాలను కథలుగా చెప్పుకొని కృతజ్ఞతాంజలి ఘటిస్తుంటారు.

ఆడంబరాలకు దూరంగా, అనురాగరస తీరంతో అన్యోన్యతాభావానికి ఆశ్రయంగా మనుగడ సాగించడమే ఆయన ధ్యేయము. హెచ్చుతగ్గుల భావన యెరుగని వ్యక్తిత్వము వారిది.

తనవద్ద చదివిన శిష్యుడే తనతోపాటుగా—అధ్యాపక వృత్తి నిర్వహించవలసి వచ్చినపుడు—ఆయన యెంతటి మహదానందాన్ని అనుభవించేవారో: ఎబ్బెట్టులేని ఏకాగ్రతతో చనువుగా; సమముగా; సాదరముగా; ఎలా చూడగలిగేవారో: మా మిత్రుని మాటల్లో నాకు బాగా అర్థమైంది.

ఆయన నిర్వికారదృష్టికి; లౌకిక సంస్కారాతీత భావనకు జోతలు చెప్పవలసనదే: ముఖస్తుతు లాయనకు సరిపడవు. ముక్తసరిగా మాట్లాడగలడు. ముమ్మరముగా భాషించగలడు. భేషజాలులేని మనిషి. శషభిషలకు జంకని మనీషి. స్నేహార్ద్రహృదయముతో చిరునవ్వులు చిందింప గలిగినట్లే—చర్చకు పూనుకొనినపుడు—చండశాసనుడుగా మారి చంద్రనిప్పులను గూడ కురిపించగలడు.

కాలపు పోకడలను గమనించి జీవితగమన సరళినే గాదు కావ్యరచనల వరవడిని; ఉరవడిని; గూడ మార్చుకొని మందితో కలిసి మనగలిగిన మనస్వి వెంకటరత్నముగారు.—

కాలప్రవాహములో యెన్ని మలుపులు కనిపించినా తగినరీతి అనుసరించగలిగాడు. కాని వెఱ్ఱిపోకడ లెదురైన తరి నిబ్బరముగా ఎదిరించి నిలువగలుగుటాయన విశిష్టత. కాలమెంత మారినా సంప్రదాయ ప్రశస్తికి తలనువంచి నమస్సులర్పించి—అనుసరించే ధీరుడాయన. అట్లే కవితా వైఖరులలో గూడ అర్థరహితముగా ప్రత్యక్షమయ్యే మార్పుల నాయన స్వీకరించడానికి సమ్మతించలేదు.

రసాత్మకధోరణికి, సంప్రదాయ ముద్రకు; శాస్త్రీయ పరిణామాలకు, మనోజ్ఞతకు; మధురిమకు, మంజులతకు కావ్యరచనలో ప్రధాన స్థానము కావాలని అభిలషించే భావుక పండిత శిరోమణిగా ఆయన రసజ్ఞ సాహితీలోకాన పేరుదెచ్చుకొన్నాడు.

ఆ స్థాయిలో ఆయన పలు పద్య గద్య గేయ నాటక రచనలు చేశారు. ఏది వ్రాసినా అందులో వెంకటరత్నము గారి ముద్ర స్పష్టముగ కనపడడం విశేషము. మెర మెచ్చులకొరకు వ్రాయడం తెలియని మనిషి. సిద్ధాన్తా చరణములో నిక్కచ్చిగా వుంటాడు. పదాన్ని తేనెలోనో; పంచదారలోనో; అటు నిటు పొదిపిన అనంతరముగాని ఆయన దానికి ప్రయోగదశ నివ్వడు. నికషోపలంమీద నిగ్గుతేల్చిన పిమ్మట ప్రయోగదశకు వచ్చిన పదను ఆకర్ణాంతముగ లాగి విడిచిన అంబు మాదరి పాఠకుల గుండెలలోకి సునాయాసముగా చొచ్చుకొనిపోగలుగు

తుంది. తెనుగు నుడికారంమీద ఆయనకు గల అధికారము రచనలో ద్యోతకముగాని సన్నివేశమే వుండదు.

కవితా పిపాసువులకు గిలిగింతలుపెట్టే వాక్య విన్యాస విలాసాలు ; చమత్కార విశేషాలు కలం కదిపినపుడెల్ల ఆయన సరసకు చల్లన జేరుకుంటాయి. మల్లెపూల తీగ కదిపితే—పున్నాగపు పూలకొమ్మ విదిపితే కలిగే మలయ పవన పరిమళములు వెంకటరత్నముగారి కావ్యపఠన సమయములో అందరికి అందుబాటులోకి వస్తాయి. అదొక ఎనలేని అపూర్వానుభూతియే కాగలదు. హృదయ స్పందన కలుగజేసి మహోజ్జ్వలానంద మందారాలతో పాఠకుని భావసౌధాలను అలరించడమే వెంకటరత్నముగారి ప్రగాఢాభిమతము. ఈ నిర్దిష్టమైన అభిమత పథమున గావుగుండెతనముతో ; నైష్ఠిక ప్రవృత్తితో ; జీవిత రీతుల్ని వెంకటరత్నముగారు దిద్దుకొన్నారు. ఆ దిద్దుబాటు ముద్దుగా ఉంటుంది.

అందువలననే ఆయన గద్యము వ్రాసినా పద్యము రచించినా గేయమును చిత్రించినా నాటికల నల్లినా, నవలలను కూర్చినా ప్రత్యంశము ముద్దు వస్తుంటుందని పెద్దలంటారు. పదముల కూర్పులో—భావముల చిత్రణలో—ఇతివృత్తాన్ని యెన్నికజేసికొనుటలో—విభాగాలుగా కథను విశ్లేషణ మొనర్చుకొనుటలో—ప్రతిచోట పనివాని తనము ముద్దు ముద్దుగ మనల్ని మురియించుట గమనించగలము.

కొందరంటారు. వెంకటరత్నముగారి పదాలు ముద్దుగా ఉంటాయని—మరికొందరంటారు. వారి భావాలు ముద్దుగా ఉంటాయని. వేరొక కొందరంటారు. వారి కల్పనాత్మక వర్ణన ముద్దయినదని. పలువురంటారు పద్యపు నడక ముద్దని. గద్యరచన ముద్దని, గేయ చిత్రణ ముద్దని. ఆయన సారస్వతములో గల ముగ్ధ మనోహరత్వాన్ని నిగ్గుదేల్చుటకు చేయు ప్రయత్నమిది. ముగ్ధతను వివరించే నిమిత్తము కొనసాగించే రచన ముద్దుగా ఉండాలి గదా! మరి! ఆయన రచించిన "కృష్ణ కథ"తో సమీక్షా ప్రయత్నము ప్రారంభించుట ముద్దుగ నుండునని నే ననుకొన్నాను.

ఆయన కృష్ణభక్తుడు, కృష్ణచరిత్ర పవిత్రమైనదనీ; పాపలతాలవిత్రమైనదనీ; ఆయన సిద్ధాంతము. కవిగా తాను కృష్ణకథ వ్రాయకపోతే తన సారస్వతానికి పరిపూర్ణత లేదని—రాదని—ఆయన సుదృఢ భావన. శ్రీకృష్ణ లీలా విలాసాలను వర్ణించునపుడు వెంకటరత్నముగారి లేఖిని పారవశ్యంతో ఏవిధముగా నృత్యము చేస్తుందో! అనుభవానికి వస్తేగాని తెలియని విషయము. భారత, భాగవత, హరివంశములలో గల కృష్ణ కథాభాగాలనన్నింటిని, క్షుణ్ణముగా మననంజేసి అందలి విశిష్ట విశేషాలను క్రమానుసారముగా మాలగా జతపరచగలగడం—వాస్తవంగా ప్రతిభావంతమైన పని. అది ఆయనకే చెల్లింది. సుదూర దృష్టితో పరిశీలిస్తే యిది సారస్వతరంగములో కఠోర

పరిశ్రమ. ముప్పేటలుగానున్న కథాభాగాలను పఠన యోగ్యముగా ఏకసూత్రబద్ధము గావించడం వెంకటరత్నముగారి యోచనా బలానికి; కథాకథన దక్షతకు; విషయ సమన్వయాత్మక విధానానికి; గీటురాయిగా భావించవలసి వుంటుంది.

ఈ రచనలో ఆయన గావించిన మరొక సాహస కృషియేమనగా-కృష్ణకథపై అక్కడక్కడ అప్పుడప్పుడు పలువురు ప్రకటించే అర్థరహితములయిన శంకలకు సమర్థ వంతములయిన సమాధానాలను పొందుపరచుట. ఆయన ఉద్దేశపూర్వకముగా సాగించదలచిన యీ ప్రయత్నము-కథాసౌందర్యానికిగాని; వర్ణనావైభవానికిగానీ; శైలీ మాధుర్యానికిగానీ; బాధకముగాని తీరున సాధకముగా రత్నమై మెరిసింది.

కృష్ణకథను పఠించనెంచిన ప్రతివ్యక్తికి కొదిపాటి నిశిత పరిశీలనాత్మక దృష్టిని కలిగి ఉంటే అడుగడుగున పైన పేర్కొనబడిన సత్యాలు ప్రత్యక్షాలు కాగలవు.

"శ్రీకృష్ణుని రూపము దేవత్వముయొక్క మూర్తి. శ్రీకృష్ణుని గీత సకల వేదాన్తముల సారము. కావుననే శ్రీకృష్ణుని కథ సూత్రప్రాయముగా పాఠకులలో భాసించవలెను."

ఈ గ్రంథ రచనలో వెంకటరత్నముగారి ఆశయమిది. సన్నజాజిపూల తీగవలె సాగివచ్చిన—రచనలో శ్రీకృష్ణ స్వరూప సాక్షాత్కారము తప్పక పాఠకునకు లభ్యపడగలదు.

" ఈ విశ్వ మొక యంత్రము. ఆత్మరహితమైన చలన వస్తువు, యంత్రమును నిర్మించిన తెలివిగల వాడొకడుండవలయును గదా! అటులననే యీ జగత్ప్రాణము యొక్క ఉనికికే హేతువుగ ఒక పరమాత్మ ఉండవలెనుగదా!"

వారి ఊహ లీగ్రంథమున నిట్లు సాగినవి.

" శ్రీమద్భాగవతమునందును, — ఇతరపురాణములందును చక్కగ వర్ణింపబడిన శ్రీకృష్ణుని కథాంశములను నవ్య దృష్టితో పరిశీలింతము ".

శ్రీకృష్ణకథను సంగ్రధించుటలో రచయిత పరమాశయ మిదియే.

" శ్రీకృష్ణుడు యువతీసంఘములో నర్తించినను వానిలో నెవ్వతెకును కోర్కె తీర్చలేదు. అట్టి మహాత్ముడు చేసినను చేయనివాడు తినినను తిననివాడు ".

" ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వాకరోతియః లిప్యతేన సపాపేన పద్మపత్రమివాంభసా " శ్రీకృష్ణలీలకు కవిగారి సముచిత సమన్వయ మిది. వైదిక ధర్మోద్ధారకునిగా, తాత్త్వికునిగా, రాజ్యాంగ వేత్తనుగా, శ్రీకృష్ణపరమాత్మను పాఠకుల కనుల ముందుంచుటకు గావించిన సుందర మహా ప్రయత్నమే 'కృష్ణకథ' రచన.

"మానవుడు ధనమునకు దాసుడు. కాని ధన మెవ్వరికిని దాస్యము చేయదు". కృష్ణకథలో భీష్ముని వాక్యములివి.

"సూర్యుని ప్రకాశము ఎల్లలోకముల ప్రసరించును. దుర్మార్గుడని యొకనిపై ప్రసరింపకుండుటయు భక్తుడని మెండుగ నొకనిపై ప్రసరించుటయు లేదు. దుర్వాసనగలమురికిగుంట యందును, సువాసన గల చక్కని పూవు పైనను సూర్యప్రకాశము సమదృష్టితోనే ప్రసారమగును."

భగవంతునికి జీవలోకముపైగల సమతాదృష్టిని వెంకటరత్నము గారీపగిది ముద్దుగ వింగడించి విశ్లేషించినారు.

కృష్ణకథను జదివినచో శ్రీకృష్ణుడు యుద్ధమునకు ముందుగ దిగువాడు గాదనియు, దుర్మార్గము నుండి తాను రక్షణగావించుకొని - లోకమును రక్షించుటకే యుద్ధము లాచరించెననియు తెలియును. గీతాచార్యుడుగా అతిలోక మోహన వేదాస్త్రధారను మానవ హృదయ కేదారాలపై వర్షించిన జ్ఞాన నీరదముగా, శ్రీకృష్ణుడు పాఠకుల మనస్సులలో నిల్చియుండునట్లు కృష్ణకథ రచన సాగినది.



# మధురయాత్ర

వెంకటరత్నముగారికి తెలంగాణా సారస్వతోద్యమాలతో గల పరిచయము గొప్పది. సర్కారు జిల్లాల కవులతో వారికి పరిచయము పరిమిత మన వచ్చునా! ఏమో! కాని వారి కావ్య సరస్వతికి పీఠికారూపాన అలిక ఫలకాలమీద తిలకాలు దిద్దినవారు బహుళ సంఖ్యలో తెలంగాణాకు సంబంధించిన ప్రముఖ వ్యక్తులే కనిపిస్తారు.

అచటగల ప్రముఖ సారస్వత సంస్థ సాహితీమేఖల. ఎన్నో రసవత్తర గ్రంథాలీ సంస్థనుండి పుంఖానుపుంఖముగా పాఠకుల సన్నిధికి చేరుకున్నాయి. సాహితీ మేఖలకు ప్రధాన వ్యవహర్తగా పనిచేసిన పులిజాల హనుమంతరావుగారు. సంస్థ రజతోత్సవాల సందర్భాన వెలువరించిన వెంటరత్నముగారి 'మధురయాత్ర'ను సహృదయులకు పరిచయము జేయుచు పలికిన పలుకులు గమనార్హములు.

"భౌతిక మావశ్యకమయినను, ఆధ్యాత్మికము పెంపొందింపజేసికొనుటయే మానవ జీవిత పరమావధి అని మా విశ్వాసము. ఇట్టి మా యుద్దేశ్యమునే మధుర యాత్ర వెలిబుచ్చును".

ఈ మధురయాత్ర అనెడి మధురాతి మధుర కావ్యము ప్రప్రథమముగా ప్రముఖ సారస్వత వేత్తలయిన శ్రీ గడియారం రామకృష్ణ శర్మగారి సంపాదకత్వమున వెలువడెడి 'సుజాత' మాసపత్రికలో ప్రచురింపబడింది. అప్పుడే యేతత్కావ్య పరిమళాల ఘుమాయింపు రసజ్ఞపాఠక లోకాన గుప్పుమన్నది. పద్యప్రియులీ కావ్యాన్ని కమ్మని విందుగా తలంచి - రసోదంచితమైన మనస్సుతో స్వాగతం అందించారు.

ఉమర్ ఖయ్యామ్ పేరు వినని రసజ్ఞులుండరు. భోగ లాలసుడైన మహాకవి. భౌతిక సంపదపట్ల అనుభవముపట్ల అచంచల విశ్వాసముగల తాత్త్వికుడు, సౌందర్యపిపాసి. రసప్రపూర్ణ దృష్టిగల వాఙ్మయ స్రష్ట. పరిమాణమున ఉమర్ కవి రచన గొప్పది కాకపోవచ్చును. నూరుకు మించని రుబాయీలు కల యీయన కావ్యము ప్రపంచమున యువజగత్తులో బ్రహ్మాండమైన సంచలనాన్ని కలిగించింది.

" ఈ ప్రపంచమున మానవుడు నశించుచున్నాడు. ఎందరో రాజులు; కవిరాజులు నాయకులు, గాయకులు గూడ నశించి మట్టిలో గలిసినారు. ఈ ప్రకృతి నిత్య నూతనత్వమును సదా ప్రదర్శించుచునే యున్నది. ప్రతియేట వసంతము వచ్చుచున్నది. కోయిలకూత వినబడుచున్నది. పృథివి అలంకృతయై నాట్యమొనర్చు చున్నది. మనకున్న సమయము కొలదే. వీలయినంత




సుఖమును పొంది మనము గూడ వెనుకటి వారివలె పృథ్వీ గర్భమున విశ్రమించవలసినదే. బలము గల ప్రభు వైనను – లావణ్యవతి యగు లలనా శిరోమణియైనను, – చిరకాల మిచటనే నిలుచుటకు వీలు లేదు. సుఖాసక్తి జ్వలించుట సర్వసాధారణ నైజము. దాని నాపుట దుర్లభము. విషయ మిట్లుండ ముక్కు మూసికొని వాంఛ నరికట్టుకొనుటకు బలవత్ప్రయత్న మేల? కనపడని స్వర్గము వైపు చూపేల? కనపడెడి యిహమే స్వర్గమనుట మంచిది. కావుననే భోగము మంచిది. ”

ఉమర్ ఊహలిట్లు సాగినవి. ఆ సందర్భముననే గుర్తునకు దెచ్చుకొనదగిన మరొక విదేశీయ కవివరేణ్యుడు ‘రబ్బీ’. ఈయన ఖయ్యామునకు సమకాలికుడు. కాని వయసున జిన్నవాడు. భౌతిక భోగలాలసత యందేవ గింపు గల వ్యక్తి. కావుననే ఆత్మకు ప్రాధాన్యమిచ్చి దేహము కేవలము దానికి సహాయకారిగ మాత్రమే యుండ వలయుననెడి సిద్ధాంతము నీయన రూపొందించినట్లు తెలియుచున్నది. రబ్బీ సిద్ధాంతమును గూడ కొందరాంగ్లేయులు వలచి తలకెత్తుకొనుట జరిగినది. కాని రబ్బీ రచనల కనువాదము మాత్ర మితర భాషలలో కన్పించదు.

ఖయ్యాము విషయము రబ్బీ సిద్ధాంతమునకు పూర్తిగా భిన్నము.

" పడతి, పానపాత్ర – ఈ రెంటితో జీవితమున స్వర్గ సుఖమును జూరగొనుము. గతమును భవిష్యత్తును మనస్సు దరికి జేరనీయకుము. వర్తమానమున సుఖించుట కంటె శ్రేయోదాయకమైనది యీ జీవితమున మరియొకటి కన్పించదు. "

మత్తెక్కించెడి సుఖ భోగాల పుట్టపై తిష్టవేసి జీవిత పరమార్థాన్ని ప్రబోధిస్తున్న శృంగారయోగిచూడామణిగా యువ ప్రపంచానికి ఉమర్ సాక్షాత్కరించాడు. సల సల మరగుచున్న పడుచుదనపు నెత్తురు సెలయేళ్ళలో పరవళ్ళు త్రొక్కుచున్న యువతీయువకులకు ఖయ్యాము కవి ఆరాధ్య సారస్వత దైవమైనాడు. కావుననే యువ ప్రపంచము ఖయ్యాము భావాలకు నీరాజనాలెత్తుట జరిగినది. ఖయ్యాము సిద్ధాన్తాలపట్ల పడుచువారి గుండెలలో ఆరాధనా దృష్టి పెరిగినది. పరిధులనధిగమించి ఉమర్ ఊహలు ప్రాకాయి. పలుభాషలలో పైకారణమువలననే పరివర్తితము లయ్యాయి.

ఉమర్ భావాలను స్వభాషలో అనువదించడం ప్రతిభకు నికషోపలముగా నాటి పండితకవులందరు భావించేవారు. అన్ని ప్రాంతాలలో - ఏతాదృశములయిన అభిమాన రేఖలు మొలిచాయి.

ఈ విషయములో తెలుగు కవులు సైతము వెనుక బడలేదు. దువ్వూరి రామిరెడ్డి వంటి వారు - ఎందరో రుబాయతుల ననువాదము చేశారు.

"పరమెు! గిరమ్మొదానితలపైనొక దోసెడు దుమ్ముజల్లి సుందరి లవలీక పోలముల దాచిన ముద్దులు దొంగిలించి సంబరమున సీధువానుము - నమాజులు పూజలు సేయనేల - ఎవ్వరయిన వచ్చినారె మృతవాటిక కేగిన పూర్వయాత్రికుల్?
(పానశాల నుండి)

రమణీయమైన కమనీయ కవితా ధారలో ఖయ్యాము భావాలు తెలుగు కవితయందు చోటు చేసుకొనగా ఆంధ్ర యువ హృదయము తన్మధురిమల నాస్వాదించి యుబ్బి తబ్బిబ్బయినది. నిన్నటిమాట మఱచి రేపటి గొడవ విడిచి బ్రతుకును నేటి సుఖమున దేలించుకొనుమని చెప్పిన బోధ యువతకు బాగుగ నచ్చినదేమో! వంట బట్టినదేమో!

కావున మట్టిలో గలియకన్ వసియించు దినాల నెచ్చెలీ!
జీవిత సౌఖ్యముల్ మనము చిక్కిన మట్టుకు జుఱ్ఱి పోదమే!
ఆవల మట్టి మట్టి గలియన్ మధువుండదు గానముండదీ
నీవను పాటగత్తె ధరణిం గనిపింప దనంత మంతయున్.

కనిపించునదే సత్యమనియు - తృప్తిదీర అనుభవించునదే సుఖమనియు, భ్రమించి - వర్తమానాన్ని మాత్రమే విశ్వసించి, సంచరించుమని యెల్గెత్తి వచించెడిది ఖయ్యాము తత్త్వము —

ఘటమున్ జేయుకులాలు డీశ్వరుడు చక్రంబద్దికాలంబు ప్రి
స్ఫుట దివ్యోపము చక్రివేగమును వ్రృత్తుప్రవృత్త ప్రశాంతమ్మునన్
బటుదృష్టిన్ గమనించితే!–ఖలుడు తత్పాత్రిన్ సురన్ ద్రావుమం
చెటులన్ నిల్పాదు జన్మయంచు గతమేది? నేడె నిత్యమ్మనున్.

మృగములకంటె మానవుడు మిన్న యనందగు సూత్రిమొక్కటే
జగమున నబ్బినట్టి ఫలసంతతి దృష్టిగానున్ మృగావళుల్
జగతికి మించి యెద్దియొ యసాధ్యము గోరు ప్రియత్నపాళిచే
వగగాని పొందకున్నను ప్రిభావ మదే నరజన్మ మందునన్.

తినినంతదిని – త్రాగినంత త్రాగి – తృప్తిదీరక మరల దినుటకు ద్రాగుటకు తపనజెందుటయే మానవ ధర్మమా! తద్భిన్నమైన శాశ్వతానందమును గూర్చెడి యే తత్త్వమునో సాధించుటకే నరుడారాట పడవలెను. మృగ తుల్యముగ జీవింపక యిట్టి పరమార్థమును – భూత వర్తమాన భవిష్యత్కాలములపైగల విశ్వాసముతో కొన సాగించుటయే నరజన్మ ప్రభావము.

ఇట్లు నూతన పథము వంకకు మానవుని దృష్టిని మరల్చెడిదే రబ్బీ సిద్ధాన్తము.

ఈ సిద్ధాంత ద్వయమును సాహిత్యవేదికపై ఏక కాలమున సాక్షాత్కరింపజేసి యువతలో చెలరేగిన ఉద్రే

కపటలజడిని, చంచలమనస్కతను తొలగించి - చురుకైన యాలోచన గలిగించి - నచ్చినపథమున పాఠకుల నడిపించుటకై వెంకటరత్నముగారు గావించిన పవిత్ర ప్రబోధాత్మక ప్రయత్నమే 'మధురయాత్ర.'

ఖయ్యాము రబ్బీలు - తూర్పుపడమరల వంటివారు. ఒకరిది భోగదృష్టి; వేరొకరిది యోగవీక్షణ. లౌకిక సుఖానుభూతి నొకరు వాంఛించారు. కాగా అలౌకికమైన ఆత్మ పరమాత్మల సమైక్యతా విభూతిని మరొకరు కాంక్షించారు. సంశయమే జీవితముగా వ్యథలపాలై నిరాశతో క్రుగ్గిన వారొకరు. విశ్వాసమే సర్వస్వమై వివేకవంతమైన దివ్యాశతో మనుగడను సాగించినవారొకరు.

పానపాత్రనే ధ్యేయముగ నెంచిన దొకరు. జీవితమును మధురయాత్రగ మలచుకొనవలెనని ప్రబోధించిన దింకొకరు.

అనుభవాల పరిధిలో కోరికల నదుపు చేయని విశృంఖలత నభిలషించిన దొకరు - అనుభవాల కవ్వలి యొడ్డున గల సత్యాన్వేషణకై నియమబద్ధ ప్రవృత్తి నాదరించిన దింకొకరు. దక్షిణోత్తర ధ్రువసదృశములైన యీ సంఘర్షణల మధ్య నలుగుచున్న ప్రాణులకు 'మధుర యాత్ర' మందమలయానిలమే కాగలదు.

వైరుధ్యముతో పరస్పరము భేదించుచున్న వివాదాలను - ప్రవక్తల తత్త్వాలను - సూటిగా సుస్పష్టముగా 'మధురయాత్ర' విశదీకరించుచున్నది.

విభిన్నదృక్పథములు గల యిరువురు మహాకవుల భావాల నొకే యొక గ్రంథమున సంగ్రథించిన అనువాద కర్తగా వేంకటరత్నముగారు కృతకృత్యులయినారు. కలి యని రెండు పదార్థముల నొకే మూసలో కరిగిపోసినట్లు యినది. కాని యవి రెండును నాణెమున కిరు వంకల గల బొమ్మ - బొరుసులవలె మధురయాత్రలో వేనికవియే వాని నిజరూప లీలలను జూపుచున్నవి.

ఖయ్యాము రబ్బీల కవితా విశేషాల స్వస్వరూపాలను సాక్షాత్కరింపజేయుటలో వెంకటరత్నముగారు జూపిన చతురత మహాద్భుతము - మనోహరము.

పసచెడ వాదభేదముల పండితులన్ పడిచావనిమ్ము ఈ
ముసలి ఖయాము కింత సుఖమున్ సమకూర్పగ రమ్ము నెచ్చెలీ!
ఈ సురను పిట్టలేచునెపుడో! యిది సత్యమసత్య మన్యమే
కుసుమము నిల్చురాలక తగుల్కొని తీవియపైన నిత్యమై?

ఖయ్యాము భావన యిది. ముసలితనమున గూడ నెచ్చెలి ముచ్చటయే యతనికి.

స్వామీ! నాడును, నేడు నీ దయను విశ్వాసమ్ముతో గోరియే
యే మార్గమ్ముల చిక్కులొడ్డినను నిన్నే చేరగా వచ్చితిన్
నా మౌఢ్యమ్మున జన్మచక్రగతిలో నన్ దప్పులేమున్న చో
నా మంచిన్ గ్రహియించి తృప్తిగొనుమన్నా! నన్ను
మన్నింపుమా!

ఇది రబ్బీయోచన.

వార్ధక్యమ్మున విశ్వాసమ్ముతో స్వామి దయ నభ్యర్థించుచున్నాడు. మూఢుడనై జన్మచక్ర గమనమున జేసిన దోసగులను మన్నింపమనుచున్నాడు. విశ్వాసమూపిరిగా రబ్బీ పలికిన పలుకులు కర్తవ్యనిర్దేశ మొనర్చుచున్నవి.

ఎక్కడనుండి యీ జగతి కెందుకువచ్చితి వాగుపోలె యే
దిక్కున కీ ప్రయాణము మదిన్ దలపెట్టియె వచ్చినాడనే
ఇక్కడనుండి యేకడకు నేగుదునో ! చవుటింబయళ్ళపై
కెక్కినగాలి పోలిక వహించి అభీష్టముతోడ పోదునే !

సంశయగ్రస్తుడైన ఖయ్యాము మాటలివి.

" నీవు సృజించినట్టి దిది నీవె గ్రహింపుము దీని నిర్మతిన్
యౌవన వార్ధకమ్ముల మహామతి గూర్చితి వవ్విదాటి నే
నీ విధి వచ్చుచో దొసగులెన్నో ! క్షమింపుము. " —

ఇది ఆత్మ పరమాత్మను పొందుటకు పడు తపనను వెలువరించుచు రబ్బీ సాగించిన ఆలోచనాధార.

మొత్తము మీద ఖయ్యాము రబ్బీల యూహాలు భిన్న ధోరణులలో కొనసాగిన తీరును తేటతెల్లమొనర్చ; తెలుగున వెలుగులు వెలార్చ; జరిపిన జతనము రతనమై మెరసినది. భాషాంతరీకరణ ప్రక్రియ సాహిత్యమునందసి ధారావ్రతము వంటిదే. మూల గ్రంథ భావ రేఖలు ప్రకాశింపజేయుటకు కవి గైకొనవలసిన శ్రద్ధ సామాన్యమైనట్టిది కాదు. వాస్తవముగ అనువాదకారునకు స్వేచ్ఛయుండదు. భ్రమరము మాదిరిగా మూలము చుట్టును

భాషాంతరీకరణ మొనర్చు వాని మనస్సు ప్రదక్షిణ లాచరింపవలెను. పదములలో సొంపు తగ్గరాదు. శైలిలో మార్దవమే తాండవింపవలెను. సాహిత్యపు విలువలకు ప్రాముఖ్యము గన్పట్టవలసిన యవసరమెంతగనో కలదు. అన్నింటి కన్న ప్రధానముగ అనువాదకారుని ముద్ర భాషాంతరీకరణమున స్పష్టముగ ద్యోతకము కావలసి యున్నది.

అనువాదకుడు కృతకృత్యుడు కాగల్గుట కింత యజ్ఞము సాగించవలెను. వెంకటరత్నముగారి కృషి యీ విషయమున ఫలప్రదముగనే కొనసాగినది.

ఖయ్యామునో, రబ్బీనో, అనువదించుటకు గాక యిరువురి రచనలనొకే గ్రంథమున అనువదింప సంకల్పించుటలో చూపిన గడుసుతనమునే వెంకటరత్నముగారు ప్రతిపద్యమున జూపగలిగినారు. వాస్తవమునకాయన రబ్బీ సిద్ధాంతమునమసరించి, వ్యవహరించువ్యక్తి. భోగపరత కంటె; యోగనిరతికి వారి హృదయమున గురుస్థానము గలదు. కాని : ఆ కారణమున ఖయ్యాము భావములను తెలుగుసేయుటలో నెచ్చటను పక్షపాతము గన్పడదు. రబ్బీవలె నూహించి రబ్బీ కవితల ననువదించినాడు. ఖయ్యాముగా మారి ఖయ్యాము కవితాహృదయము నావిష్కరించినాడు.

ఎవరి కవితారీతులను పఠించునపుడు వారే మన మనసునందు మెదలునట్లుగ జేసినాడు. ఖయ్యాము రబ్బీల తత్త్వాల యనువాదమున వారి వారి యూహల కనుగుణమైన పదజాలమే తెలుగున వెంకటరత్నముగారి హస్తమునుండి జాలువారినది.

భౌతిక భోగలాలసతాపూర్ణదృష్టితో ఖయ్యామును- పావనాధ్యాత్మిక తత్త్వ చింతనామయ ధోరణితో రబ్బీని - మన యెట్టెదుట 'మధురయాత్ర' సాక్షాత్కరింపజేయును.

మనమెద చూరగొన్న ప్రియమాన్యులు సుందరులుత్తముల్ విధిం
బెనచినకాలవాహ సరణింగొని యబ్బిన ద్రాక్షలోడ్చి కూ
ర్చిన మదిరన్ తలా ఒకటొ! రెండొ! గళాసులు త్రావిపోయి రొ
క్కని వెనుకన్ మరొక్కరు సుఖమ్ముగ నిర్వృతిజెంద నెందరో!

(ఖయ్యాము)

భావానుగుణమగురీతిలో పద్యమునడచిన తీరిది.

“తలా ఒకటొ! రెండొ! గళాసులు.”

ఇది ఎంత వింత ప్రయోగమో! అంతమంచి ప్రయోగము. సాదాగా సాగిపోవుచున్న భావప్రకటనలో పదములడ్డుపడుట వెంకటరత్నముగారి కనభిమతము. కావుననే అట్టి సందర్భాలలో సర్వసాధారణ వ్యవహారము నుండి వచ్చిన పదాలు చోటుచేసికొనును. అట్టివే “తలా ఒకటొ రెండొ! గళాసులు”.

వ్యాకరణమును కొరకిచట వెదుకవలసిన పని యుండదు. భావస్ఫూర్తికి సంబరపడవలసినదే. ఒత్తుగా కట్టిన మల్లె చెండు పరిమళాల మత్తులో; చెండు గట్టుటకుపకరించిన నారపీచు సంగతి యెవరికి బట్టును? కవిగారిట్లనుకొని యుందురేమో!

యౌవన శోభలో తనువు కబ్బిన భోగము భాగ్యశృంగముఁన్
భావములెన్నొ కొన్నమది భాసురమై తగసృత్యగార మం
దే విధ మాయగా గలవు? ఇంత కృతజ్ఞత జూపగూడదో!
చేవదలిర్చునా పరమ శిల్పము నింతపతింప గూడదో!

(రబ్బీ)

ఎంత గంభీరమైన భావన—ఎంతటి మెత్తని వివరణ? ఎంత చక్కని శైలి. 'పరమ శిల్పము' పద ప్రయోగముతో 'పరమశిల్పి'యైన భగవంతుని పాఠకునికి జ్ఞప్తికి దెచ్చుటలో వెంకటరత్నముగారు చూపిన విజ్ఞత స్తవనీయము. పదములకు ప్రాణము పోయుటన నిదియే యనవచ్చునా! ప్రజ్ఞావంతులయిన కవులిట్టి ప్రతిభావంతములైన ప్రయోగముల కావింతురు కాబోలు.

1) దావిదు పికస్వరమెన్నడొ! మూతపడ్డదై పోయెను.
2) బుల్బులదె ముద్దుగ దివ్యముగా గులాబిపై గూయును.
3) బంగరు పంటగాదెలకు బట్టినవారు.

4) మావికొమ్మల వికస్వర సుస్వర గీతి పాడు కోకిల చనె నేడకో ! ఎపుడొ గిజ్జున వచ్చును చూతురెవ్వరో!

5) వెనుకటి నాళ్ళ జమ్మిదు రవింబలె వెల్గుచు ద్రావినట్టి మోహనతలి నిప్డు సింహములు బల్లులు, హాయిగ తీరు చున్ సభల్.

6) పడతిరొ ! గిన్నె నింపు మిల జాసిన నిన్నలకున్ — అజాతలై పుడమికి రాని రేవులకు - బొక్కక; నేడు సుధల్ స్రవించుచో.

7) తోచిన మట్టుకు త్రావుమోయి ! ఈ భూమిని వీడితో ! మరల ముట్టగలేవు మధు ద్రవమ్ములన్.

8) కరచరణాదులే విషయకాంక్షల వెంబడి బర్వులెత్తు నావరుసనె యాత్మయున్ బరుగు వారనతండగు జంతు తుల్యుడు. "

9) "పరమ విచిత్ర శిల్పి మన పాలిటి కిచ్చిన విశ్వచిత్ర మందరయుము నేర్పుతీర్పులు."

10) శైశవమందు కోవిదుల సాదుల పజ్జల జేరి శ్రద్ధ నాపోశనబట్టినాడ ఘనముల్ పలుతీరులు జ్ఞానవాదముల్

వెంకటరత్నముగారి మధుర ప్రయోగాలలో మచ్చునకు కొన్నియిట జూపబడినవి. హస్తకౌశలముగల కవి యొక్క ప్రజ్ఞ అందమైన ప్రయోగాల కూర్పులో కనపడు నను మాట సత్యము. పద్యము ఛందోబద్ధముగ సాగుట

ముఖ్యముగాదు. నడకలో సొగసు రావాలి. బిగువుకావాలి. పొంకము బింకము గల వాక్యము రసవత్ప్రయోగముగ నిల్చి అవలీలగ పాఠకుల రసనాగ్రాల మీద నర్తిస్తుంది. అదే కవి యొక్క మధుర ప్రయోగ దక్షతకు సాక్ష్యముగా కావ్య మందిరమున తళుకుబెళుకులను ప్రసరిస్తుంటుంది. ఇట్టి ప్రయోగాలను మధుర యాత్రలో మనము చవి చూడగలము.

# ఇంద్రధనువు

పలు వన్నెల సరస సమ్మేళనమే ఇంద్రధనువు యొక్క స్వరూప రమ్యతను విశదీకరించును. పలు భావముల గుబాళింపుతో వివిధ శీర్షికలను మాలగా సంగ్రథించిన గ్రంథమునకు — అర్థస్ఫోరకముగా వెంకట రత్నముగారు 'ఇంద్రధనువు' అని పేరు పెట్టారు.

20వ శతాబ్దమున విదేశ సాహిత్య పరిచయముతో మన వాఙ్మయమున రూపు దిద్దుకొనిన క్రొంగ్రొత్త సారస్వత ప్రక్రియ ఖండకృతి. సర్వాంధ్రదేశమున పేను మిగిలిన పత్రికారాజములుగా ఖ్యాతినందుకొన్న ప్రతిభ, కృష్ణ, గోల కొండ, శోభ మొదలయిన పత్రికల ద్వారా ప్రచార రంగ మునకు వచ్చిన వివిధ ఖండికలను — ఇంద్రధనువులో ఏర్చికూర్చారు వెంకటరత్నము గారు.

అమృతగీర్వాణ ఝుకణీ పయస్సునుండి
వేరు పడియు మహానదీ విధిని జెలగు
కులుకు తెలుగున కైతల నొలయ జేయ
గంటమెత్తిన ప్రథమాంధ్ర కవుల దలతు

అమరభాషా స్రవంతినుండి వేరు పడి గూడ మహానది వలె ప్రవహించు స్థాయినందుకొన్నట్లు తెలుగు భాషను వారు సంభావించారు. ఆ తీరు వారికి గల మహాంధ్ర భాషా విషయిక ప్రగాఢ భక్తికి ప్రతీక.

కాల ఝుంఝూ నిలాహతి గవిసికొనియు
క్రొత్త క్రొత్త పోకడలను హత్త జేసి
ఆంధ్ర వాణికి నవ్యత లలవరించు
నాంగ్ల సాహితి నెవ్వ రేమనిన గొలుతు.

తా నాంగ్ల సాహితిని గొల్చుటకు కారణమదియుట, నిజము. మన సారస్వతమున కాంగ్ల సారస్వతముతో పరిచయ ప్రాబల్యమేర్పడిన తరువాత తుష్టియు, పుష్టియు నేర్ప డెనను మాట కాదనరానిది. వాదనలకు చోటునీయనిది. క్రొత్తదనాన్ని కోరి ఆహ్వానింపవలసినదే. మంచి యెచట నున్ననేమి ? ఎవ్వరిదైన నేమి ? మనకు శిరోధార్యమే. వెంకటరత్నముగారి భావన అభినందనీయము.

ఈ ఖండకృతిలో వారి భావనలన్నియు పండబారి నట్లున్నవి. నిండుదనమును సంతరించుకొన్నట్లున్నవి.

భాషలో కొన్ని చోట్ల ప్రౌఢత మెరసినది. కొన్ని యెడల మృదుత్వము కురిసినది. శైలిలో లావణ్యముతో బాటుగ తారుణ్యము గూడ వెల్లివిరిసినది.

వాక్కుమనమున - మనమును ప్రాణమందు -
ప్రాణమును తేజమున, నది పరమునందు -
లీనమగునంతవరకాతడెరుగ గలఁడు
లీనమైనంతనే మాత్రమెరుగ లేడు.

గొప్ప యోచన వేదాంత భావనకు తాత్త్విక దృక్పథమునకు సూత్రప్రాయ సూచిక.

ఆకలిమంటల కలకలాన్ని అభివర్ణించడం కవులందరకు సర్వసాధారణమే. చిత్ర విచిత్ర రీతులలో హీనుల దీనుల ఆకలిబాధలను అక్షరబద్ధమొనర్చిన ఆధునికులలో వెంకటరత్నముగారి విలక్షణ వైఖరికి క్రింది పద్యముదాహరణము.

అగుగాక! నిత్యరమ్యానందమయ జగత్తిది - దీనితో నాకదేమి పొత్తు.

జౌనేమొ! ఇదియె నిత్యైశ్వర్య దోదూయ
మానవసుంధర - ఐననేమి
కానిమ్ము! బహు వాహినీ నిర్మిత శ్యామ
సస్య సమృద్ధ, యే జనుల కగునొ!
ఈ శరశ్చంద్రికా కాశమందానిలో
త్సవరాజి నీయెద శాంతిగొనదు.

ప్రకృతి శోభల మధువు లెవ్వనికి హితవొ!
భావడోలల నెక్కనెవ్వనికి రుచియొ!
కాగి - ఈ గర్భమున నార్చు పేగులకు రవంత
గంజియె నేడగు ప్రకృతి శోభ.

మహాద్భుతమైన ఊహ-రసార్ద్రమైన కల్పన-చివరి పంక్తి చదువగనె గుండె కుదిలించినట్లుగావలసినదే. ఎదనుండి అశ్రుకణములుబికి పొరలవలసినదే.

భావనలో గల ప్రాగల్భ్యమునకు పదములు ప్రాణము పోసినవి. శబ్దచిత్రణ అన నిదియే కావచ్చునా!

నరునివైఖరికి భయపడి - తదితర ప్రాణి యిట్లను కొనుచున్నదట.

నోరులేని పూవుల సెలయేరులన్; వి
శుద్ధతారల; హిమకర సూర్య ధవళ
నీరదమ్ముల; మృగముల నీడజముల
గనుచు; నా ఆప్తబంధులుగా దలంతు.

నరుని మాత్రము శత్రువుగా దలంచునట. నరత్వమున దాగిన క్రూరత్వమునకు భీతిజెంది పలుకుచున్న పలుకులు గాబోలు.

నరుడెరుంగని యే కొండచరియలందొ!
సెలలు జిలుకు స్వచ్ఛ స్వాదు శీకరములు
తరువు లొసగు కమ్మనిపండ్లు తనివిదీర
దొరకుచోట వసింప సంతోషపడెద.

నరుల మధ్య శాంతి యలభ్యమని గదా! దీని భావము.
హాయి కొండచరియలలో దక్కునని గదా! ఆశ.
మానవతను మదింపు వేసి చెప్పుటయా ఇది?

చైతన్య స్పృహ యను శీర్షికలో భావన యెంత గంభీరముగ నున్నదో? భాష అంత మహోద్ధతముగ సాగినది. ఇట్లు భాష వ్రాయుటొక కళ. ప్రాచీన కాలపు ప్రౌఢ ప్రబంధములలో ఇట్టి ఛాయలుండుట సర్వ సామాన్యము. ఇంద్రధనువు నవీన కావ్యము గదా!

తారాచంద్ర గభస్తి మండల సముద్యత్కర్షణ భ్రాంతి చిం
తారింఛోళి విమాన యాన గమనాంధ వ్యర్థ విశ్వాస కా
ర్యారంభుల్ గనజాలలేరుగద! భవ్యాకార దివ్యత్వ్రకా
శోరువ్యాపృతి ముందు బెట్టిన కళాభ్యుచ్ఛ్రాయ
వైచిత్ర్యముల్.

ఏమి పదగుంభన? ఎట్టి భాషాధికారము? భళీయని పించునవి ఇట్టి సందర్భములే.

ద్వైపాయన హ్రదమున దాగి యున్న దుర్యోధ నునిచే కవి యొక శీర్షికయందిట్లు మాట్లాడించుచున్నాడు.

మాయదురోదరంబని విమర్శలు సేసిన పాండుపుత్రుల
న్యాయరణంబులో దిగి వినాశమొనర్చి రజేయు కర్ణునే
సాయములేదు-ఈ మడుగు సాయము గూడవిదిర్చివత్తునా
న్యాయ సమీక మబ్బవలె నాశము కారెసుయోధనాహతిన్

కాదు కాదెన్నటికి పోరుగాదు న్యాయ
శాస్త్రపద్ధతి, పాండవ సరణి మారె
ధర్మరాజున కీ చెడ్డ తలపు గలిగె
తనువు మనరాదు - వీరమాతలఋణమ్ము!
దీర్ప నెట్లు విసర్జింతు దేహమవని.

అంత పని జరిగిన పిమ్మట దుర్యోధనునికి ది యంతయు అన్యాయమని తోచెనట, పాపము. గురివింద సామెత గుర్తునకు దెచ్చుచున్న రాజరాజు పలుకులపైగాక - కవి వ్రాసిన పద్యములపై సానుభూతి కలుగుచున్నది.

## ధర్మజ నిర్వేదము (మరొక శీర్షిక)

కర్ణుడే అగ్రజుడని గ్రహించిన అనంతరము ధర్మజు నిలో ప్రజ్వరిల్లిన అంతర్వేదన యీ ఖండిక యందు వ్యక్తమగును.

ఎన్నడు దెల్పవైతివిగదే! జననీ! రవిపుత్రుడైన మా
యన్న కలండొకండనుచు నాతడు కర్ణుడటంచు నింత చా
టున్నదె? తల్లికిన్ సుతులకో విపరీత విధీ! యతండు మా
మున్ను జరింపనేవురము మొగ్గర మందటు జంపికొందుమే.

ఆతని జూచినప్పుడెపుడైనను దోచెడి తల్లి పోలికల్
చేతములో నొకానొక విచిత్రపుటూహను రేపినన్ పెడన్
ద్రోతున్ గాని మూలము కనుంగొన నింత తలంపనైతి నా
భ్రాతకు గట్టగా దగిన పట్టము నా తల గట్టికొందునే!

హృదయము ద్రవించునట్లు గావించిన వివరణ ధర్మజుని గుండె కుదిలించి కుప్పబోసినట్లున్న భావములు, పద్యములకు మెత్తదనమునే కాక క్రొత్త దనమును గూడ గలుగజేయుచున్నవి.

ఈ విద్రోహపు కూళ్ళ పిండములపై నెంగిళ్ళ మ్రింగుళ్ళ చే
చావన్ లేక రణమ్ములో బ్రతికినంజన్ బుట్టె నా ధర్మజుం
డీ వైభోగము చాలు నొల్లనిక నేనే యైహికాభీష్టమున్
జావన్బోదువనిన్ మునిత్వమున పశ్చాత్తాప తప్తుండనై.

ధర్మజునిలో తలయెత్తిన యీ యోచన పాఠకుల విస్మయమునందేల్చును. "భ్రాతకు గట్టగా దగిన పట్టము నాతల గట్టికొందునా !" ధర్మజుని పట్ల యెనలేని గౌరవ ప్రపత్తులను మనమున గలుగజేయు చక్కని ప్రయోగమిది.

ఈ శీర్షికలో గల పద్యముల యందు సాధారణ వృత్తములే కాక - అసాధారణవృత్తములు వ్రాయబడినవి. సందర్భోచితముగ ఛందమును మార్చి వినియోగించుకొనుట వెంకటరత్నము గారికి బాగుగ తెలిసిన విద్య.

స్వజాత్యభిమానము ; స్వభాషాభిమానము లేని వారెవరుందురు ? "ఆంధ్రత్వమాంధ్రభాషాచనాల్పస్య తపస: ఫలమ్" అని చెప్పిన మాట అక్షరాక్షరసత్యమే. కలము బట్టిన ప్రతివ్యక్తియు - మరువక; మమత విడువక

ఆంధ్రత్వము నభినుతించి తీరును. ఆంధ్రమాతకు పుష్పాంజలిని సమర్పించును. ఈ విషయమున వెంకటరత్నము గారి భావ వాహిని ప్రకే ళ్ళు రు కుచు ప్రవహించినట్లుగ దోచును.

"ఆంధ్రుడా"! అనెడి శీర్షికను గమనింపుడు.

పోయిన దాంధ్రవై భవము పోయిన దా మధురంపు కాలమై
పోయిన పూర్వ సంపదల పొందిక లెంత స్మరించినన్ నవీ
నాయుతిలోన వ్యర్థములె యౌటనికన్ తెలివొందు మాంధ్రనది
వ్యాయతనమ్ముగా తలచుమాంధ్రవసుంధర నర్చ నామతిన్

భాషలేకున్న జనులొక్క పసులమంద
భాషచేగద మానవత్వమ్ము నిలుచు
సభల పూజింపబడడె భాషావిదుండు
ప్రతిభగల వానిలో పట్టు భాషయె కద.

అద్దెకొంపలు మనకొంపలగుట తిత్త
అన్యభాషలు మనభాషలగుట కల్ల
తల్లిపూజకు పూవుల దండనిత్తొ!
దండలల్లువానికిని చేదండ నిత్తొ!

తెలుగు తల్లి యెరుంగని చెలువు లేదు
అన్ని రుచులన్ని సొగసుల కామె ప్రోవు
దేశ భాషలలో నెల్ల తెలుగు లెస్స
అనెడి బిరుదమ్మె తెల్పులే ఆమె ఘనత

కావ్యఋషి; రవీంద్రస్మృతి, రైతు చెర, మొదల యిన శీర్షికలలో రచయిత చూపిన భావనలు రసభరిత ములు. మహోదాత్తములు. భాషకు భావమునకు లేమి లేని; రాని; వారికోవకు జెందిన కవి వెంకటరత్నము గారు. కావుననే వారేది పల్కినను రమణీయమే, వారేది ఊహించి నను సముజ్జ్వలమే.

ఎంచుకున్న అంశములను బట్టి వారి భావముల పోకడను మనము గమనింపగలమనుకొందుము. కాని! చదివిన తర్వాత మనము భావించిన దానికన్న మిన్నగ వారు ప్రవచించినట్లు గమనించుదుము. భాషపై సంపూర్ణాధి కారము గల కవిగా—అనవరత పరిశ్రమతో బహు గ్రంథావ లోకన మొనర్చిన సహృదయ పరిశీలకుడుగా వెంకట రత్నము గారు వారి రచనలో మనకు సాక్షాత్కరిస్తారు.

త్రాగుబోతు దురవస్థను గుర్తించి అక్షర రూపమున నట్టి దౌర్భాగ్యులకు గూడ హితోపదేశ మొనర్ప యత్నించుట కడుంగడు విచిత్రము.

తన హృదయమును స్పందింపజేసిన యంశముపై తాను చెప్పదలచిన దానిని నిర్ద్వంద్వముగ – నిష్కర్షగ – లిఖించుట యే కవిధర్మము.

వాల్మీకి నోట ఆకస్మికముగ 'మానిషాద' శ్లోకము వెలువడినది. దానిని విని బోయవాడు పశ్చాత్తాపతప్తుడ గుననియు, – గతమును మరచి సవ్యముగ వ్యవహరించు ననియు, వాల్మీకి ఆశించెనా! ఏమో!

అన్యోన్యానురాగముతో ముక్కుల నొరసికొనుచు సంబరమున దేలుచున్న పక్షుల జంటలో బోయవాని బాణము రివ్వున వచ్చి ఆడుపక్షిని బలిగొన్నది. ఆ దృశ్యము వాల్మీకి గుండెలను పిండినది.

హృదయమును స్పందింపజేసినది. అనుష్టుప్ఛందమున హితబోధాత్మకముగ శోకమే శ్లోకమై యావిర్భవించినది.

త్రాగుబోతు లెందరు వెంకటరత్నము గారి పద్యములను జదువుకొని మనసు మార్చుకొందురో: మనుష్యులుగా మనగలుగుదురో! తెలియదు. కాని! త్రాగు బోతుల హీనాతి హీన స్థితి మాత్రము వెంకటరత్నము గారి మనస్సును ద్రవ్యయ్యలొనర్చినది.

కడుపే నిండని కష్ట జీవనములన్ గాసిల్లి నీ పిల్లలే
డ్చెడి ఘోరార్తనినాద మెవ్వనికి గుండెల్ వ్రక్కలంజేయదో
చెడుగా! చాలదె పాపమింతటికి చేసేతన్ సురంద్రావి తూ
గెడు మైమత్తున చావమోదెదవు సిగ్గే లేదె! నిర్భాగ్యుడా!

నెత్తురు బీల్చి సత్తువను నిర్మధనంబొనరించు కల్లుముం
తెత్తి గుటుక్కునన్ గుటకవేయుచు త్రాగుదువోరి మూఢ! పొ
క్కెత్తును సోలితూలి తెగనేతువు హంతక! ఆలుబిడ్డలన్
మొత్తుకొనంగ నీ మనసు మోటుకటారి గదా! నరాధమా!

విషయమును వివరించినాడు. వేయవలసిన చివాట్లు వేసినాడు కాని తృప్తికలుగలేదేమో! గట్టిగ మరొక్కమాట యిట్లనినాడు.

తెలివి గలవాడవేగాని, తెలియవపుడు
మంచి చెడ్డల - మానాభిమానములను
గంగలోపల గలియు నీ గౌరవంబు
కులమదేదన్న పిచ్చి కుక్కల కులంబు.

వెంకటరత్నముగారి ధోరణి కోపము వచ్చి నపుడిట్లుండును గాబోలు.

అది విశ్రాన్తినొసంగు దేహమున, నుష్ణాధిక్యతన్ మాన్పనం
చెదురాడన్ సమకట్టెదే! ఖలుడ! నీకెవ్వారలా వైద్యులిం
పు దలిర్పంగల కొంపలార్పుటకు మున్ముందేగు దుర్వర్తనా
స్పదులవ్వారలు సుమ్ము - లేవె పృథివీభాగంబునం
దోషధుల్ ?

తుదకు కవి యిచ్చిన సూచన ఇది.

వెంకటరత్నముగారు కవిని గురించి వ్రాయుచు చెప్పిన మాటలు పరమరమణీయములు.

కవి మనస్సును రవ్వంత కలచవలదు
వ్యర్థవాదమ్ములన్ పెంచి అపహసించి
కవి మనస్సును సుంతైన కలచవలదు
తెలియ లేవోయి! దాని లోతులకు కొలత!

లోతుల కొలత తేలని కవి హృదయమును గూర్చి ఇది యొక విధమైన కొలత గాబోలు.

చేరరాకు కుతార్కికా! చీకువాలు
నుదురు గలవాడ! పావన సదనమిద్ది
వెకిలి నవ్వులు కోణంగి వెక్కిరింత
చేరగారాదు మా తోట చేరరాదు.

విమర్శకులకొక హెచ్చరికయా! ఇది పవిత్ర భావ సౌధమనదగిన కవిత విషయమున వెకిలినవ్వులు వెక్కిరింతలు తగవనియు, సహృదయ సమీక్షయే ముఖ్య మనియు, వెంకటరత్నము గారి హృదయము, విమర్శ పరామర్శవలె నుండవలయునే గాని పగ బట్టి ముక్కపిండి నట్లుండ రాదనెడి యీ యూహ సర్వ జనాదరణ పాత్ర మైనట్టిది. టెన్నిసన్ మహాకవి భావ స్రవంతికిది ఛాయాను వాదమని వెంకటరత్నము గారే చెప్పకొనినారు.

పూచిన జాజి పందిలిని పుష్పిత మల్లికనేని పూవులన్
ద్రోచెడు పారిజాతక తరున్ గనినప్పుడు గాని వెన్నెలల్
గాచెడి రేలనేని అబలా! పులకల్ మొలకెత్తునీ సుకే
శాచిత వేణికన్ రుచిర హాసములన్ కనులిచ్చగించునే.

ఇట్టి మనోహర శబ్ద చిత్రము తెన్నియో వెంకట రత్నము గారి సుందర సుకోమల దృశ్యకల్పనా ధోరణికి ప్రతీకలుగా ఇంద్రధనువు న మనకు సాక్షాత్కరించును.

విచ్చిన పూవులెన్నొ ? కనిపించెడి యీ వనవాటిలోన నా
నచ్చిన పూవు నాకయిన నాడు కదా జనిసార్థకమ్ము కా
వచ్చెను దేవపూజకు నుపక్రమవేళ - పినాసి తోట వా
డిచ్చునొ ! లేదొ ! నా దెసకె యించుక వంగిన హేమ
పుష్పమున్.

హేమ పుష్పిక యను శీర్షికలో నీ పద్యమెంత మనోజ్ఞముగ కొనసాగినదో తిలకింపుడు "నానచ్చిన పూవు నాకయిన నాడు కదా ! జని సార్థకమ్ము" చక్కని ప్రయోగము. భావ గర్భితమైన దృశ్యము. పదముల సహకారమున నెట్ట యెదుట గోచరించును.

ఱెక్కకు ఱెక్కజేర్చి చివురించిన యీ కొన కొమ్మపైన కెం
పెక్కిన ముక్కు జంట నొకయింపుగనుంచి కనుల్మొగిడ్చి పె
న్మక్కువతో తలల్ గలిపి మాటలనాడునొ! నిద్రపోవునో!
చక్కగనున్నదా చిలుక జంటకు మ్రొక్కదలంపు గల్గెడున్

హృదయమునకు గిలిగింతలు గలిగించు దృశ్య కల్పనము. పరమ ముగ్ధ లావణ్య సందర్శనము గల్గిన భావన యెంత పవిత్రముగ నున్నది ?

"చక్కగనున్నదా చిలుక జంటకు మ్రొక్క దలంపు కల్గెడున్" సౌందర్యము దైవ స్వరూపము గదా కావున చక్కదనమును గని మ్రొక్క నతెననుచున్న కవి భావనకు మనమును మ్రొక్క వలసియున్నది.

మన అనురాగబంధ మతిమానుషమేనొనరింపగోరి నీ
అనుపమరూప మాత్మ తలియందున చక్కదిద్దుకొంటినే
వనిత! ఇహానుభూతికయి పర్వెడి వాంఛల నిగ్రహించి ని
న్ననిశము నా దరిన్ గలిగినట్టుల భావన సేయుచున్నెదన్

అనురాగబంధాన్ని అతిమానుషముగ సంభా
వించుట - ఇహానుభూతికయి పర్వెడి వాంఛల నిగ్ర
హించుట - ఇష్టురాలయిన వనితను సర్వదా సమీపము
నందున్నటుల యోచన సేయుట - పవిత్ర ప్రేమకు లక్ష
ణములు. వెంకటరత్నముగారు రాగలీలను వర్ణించునపుడు
గూడ ధార్మిక దృష్టిని; తాత్త్విక భావనను విడనాడలేదు.

అంతలోననె మెలకువ నందుచుందు
నిది విషయ వాంఛ - తుచ్ఛ మియ్యది యటంచు
కనులు ముకుళించి లోని మూర్తిని దలంచి
విమలభావమ్ముతో గనుల్విప్పుచుందు.

"లోని" మూర్తిని జూడగలుగుటెంతటి యదృష్టము.
నిబ్బరము గల నిండు మనస్సున్న వారికే అయ్యది
సాధ్యము.

"యౌవన జ్వాల" అను ఖండికలో మల్లెల వలె
వెదజల్లబడిన ముగ్ధ మోహన భావ పరంపర తదనుగుణ
ముగ సోయగముల నొలికించిన పద సంపద పాఠకుల
నొక క్షణము పాటు నిలువవైచి యోచింప జేయగలవు.
మనసులను పులకింప జేయగలవు.

తరగని పాలగడ్డ శశి - ధారుణి తాపము వాపనార్ద్రమై
కరగిన; పాలధారలు జగమ్ముల నిండెను; కాగి చల్లనై
కరుడులు గట్టి తేలినవి కమ్మని మీగడ లాకసంబు నం
దరిగి భుజింతమా! వలపులారని నవ్వుల తేనెలద్దుచున్

బాగున్నది. వలపులారని నవ్వుల తేనెలద్దుకొనుచు; కమ్మని మీగడల నారగించు టెంతటి మహా భాగ్యము!

"ప్రకృతి లీల" పేరుతో వెంకటరత్నము గారు ప్రవచించిన నిత్య సత్యాలకు కావ్యధర్మము సిద్ధించె ననక తప్పదు. విషాద సంభ్రమముల నేక కాలమున మదిలో దలపించెడి యీ యూహలెట్లు కొన సాగినవో: గమనింపుడు.

శిథిలమై దిబ్బ లెత్తిన చిత్ర చిత్ర
పూర్వ భూపాల శృంగార పురములందు
పుడమి పులకాంకురము లెత్తి - పూచినవ్వు
మంచు పన్నీరు జిల్కి హసించు. శశియు

చంకనిడుకొన్న యిల్లాలి చంటిబిడ్డ
నొడసి యెగనెత్తి నక్కల కొప్పజెప్పి
సంతసించు ప్రభంజను చర్య లెవ్వి
ప్రతిఘటించు బ్రహ్మాణ్యుండు జయులు వడడు.

గుండెలనవియ జేయు వివరణ యిది.

ఒకడు నా మాత యిది యను ప్రకృతి జూచి
ఒకడు నా మృత్యువిదియను ప్రకృతి జూచి
ఒకడు నా కాంత యిది యను ప్రకృతి జూచి
ఒక డిది యు నే నొకటె యను ప్రకృతి జూచి.

భిన్నత్వమున కాలవాలమై యున్న ప్రకృతి, విభిన్న తత్త్వాల వారికి భిన్న రీతుల నెట్లు గోచరించు చున్నదో! చూడుడు. ఈ పద్యమొక విశిష్ట ప్రకృతి గలదని అని తీరవలెను. ఇంద్రధనువు నందిట్టి చిత్రవిచిత్ర ప్రకృతుల నిశిత నిరూపణము మనల నయ్యారే! యని పించును.

సామాన్య ధోరణి కందని యూహలను సాహిత్యమున సంపుటీకరించినపుడే రచనకు మంచి జిగియు, బిగియు, సమకూరును. బహు గ్రంథ పరిశీలనాశక్తితో పదునెక్కిన మేధస్సు నుండి మాత్రమే యిట్టి లగువు బిగువు గల ఆలోచనా స్రవంతి ఉరుకులతో పరుగులెత్తును.

భారతీయతను గర్వకారణముగా నెంచుట భారతీ యుడైన ప్రతివాని విషయమున సర్వ సామాన్యమే. భారతీయాత్మ ప్రత్యేకమైన అంతస్థుగలది. భరతభూమి విశిష్టత సంబరమును గలిగించెడి యొకానొక మహాద్భుత స్థితి. భారతదేశ మహదౌన్నత్యమును – భక్తి పారవశ్యము లతో కవి ఆలపించిన తీరు గమనార్హము.

వెండి బంగరు టింఢ్లు వీడి వచ్చిన నదీ
కాంతలు విహరించు కనక భూమి
ఘోరాటవిన్ లేటికూనకు పులివద్ద
పాలు త్రాగించిన బ్రహ్మభూమి
చెడుగును త్రుంచ మంచికి బావుటా నెత్త
తనువు లర్పించిన ధర్మభూమి
తోడిదేశములు కన్దోయి విప్పని వేళ
నర్తించి కులికిన నాకభూమి
ఇది భరత భూమి నీ పుణ్య మెదియొ పండి
భారతీయుడ వైతివి ................

ఉజ్వల భావన - రసోజ్వల రచన శరీరములకు గగుర్పాటు గలిగించు కావ్యలీల. కవిని ధన్యుని గావించు చున్నవి.

"తరంగిణి" ని గూర్చి కవి యిట్లనును.

మలలు మ్రాకులు ముదురు తీవెల గుబుర్లు
వలదు వలదంచు నీకు ముంగల వసింప
కఠిన కల్లోల చండ ఖడ్గముల జీల్చి
పరువు లెత్తెద వెవ్వనిపైన గాంక్ష ?

అవును. అబ్ధివైపు పరుగులెత్తుచున్న నది పర వళ్ళతో నొడ్డులొరసికొని ప్రవహించును. అవియే కఠిన

కల్లోల చండ ఖడ్గములు. తీరమున గల ౼మాకులు తీవెల గుబుర్లు జలగర్భమున గలియుకేమగును? ఒకానొక చక్కని ధ్వనిని వ్యక్తీకరించుచున్న యీ పద్యరచన పాఠకుల యూహలకు పదును బెట్టుచున్నది.

లోకజ్ఞాన మనంగ గ్రంథముల నాలోకించుటల్ గాదు వే
ళాకోళమ్ముగ జీవితమ్ము నడియూరన్ ద్రిప్పుటంగాదు చిం
తాకల్యందెగ ద్రావి కామము పసన్ దైతక్కలున్కావు నీ
వే కర్మమ్మునకొప్పితో ముదము నందే ప్రోడవై పొందుటల్

లోకజ్ఞానమును వెంకటరత్నముగారు నిర్వచించిన తీరిది.

ఇంద్రధనువని పేరు బెట్టినందులకు పలువిషయము లకు సంబంధించిన ప్రస్తావనలతో ముద్దు ముద్దుగ సాగిన యీ ఖండకావ్యము మొత్తముమీద మనోహరతను వింగ డించుకొనజాలినది.

తెలంగాణా అల్లరులలో దుండగులచే అపహరింప బడిన జాతి ఆస్తి, పలురూపములలో నున్నది. అన్నిరకము లైన సంపదలతో పాటుగ వెంకటరత్నముగారి కావ్య సంపద గూడ దోపిడీమూకల హస్తగతమగుట శోచనీ యాంశము. నూటయేబది పద్యములుగల "రసాదర్శము" ముక్తక కావ్యమై యుండవచ్చును. ప్రతి పద్య రసో దయముగ నే పద్యమున కా పద్యమొక రత్నదీపికగ రాణించుట "రసాదర్శము" వందలి విసూత్నాదర్శము; చూడుడు.

ప్రాజ్ఞమౌ నాత్మ సంపరిష్వక్తుడైన
పురుషుడీ బాహ్యమినుమంత సెరుగలేడు
ప్రియకులాంగన కౌగిలి బిగువులోన
మైమరుపుతోడ గుదిగొన్న మనుజునట్లు

బృహదారణ్యకోపనిషత్తు (4-3-21) నందలి భావ ఖండిక కాంధ్రానువాదమిది. వేదాంత విషయ వివరణ కిచ్చిన లౌకికోదాహరణము కడుంగడు రమణీయము. కౌగిలి బిగువున గలిగిన మైమఱపునకన్న - అది ప్రియ కులాంగనకు చెందినదని చెప్పుటలోగల యౌచిత్యము రస జ్ఞులను మరల మరల మైమఱపించును.

చుక్క చెలులు లెక్కకు మీరి చొక్కి కొలువ
నిండు నెల చెలుడవ్వారి నేర్పుమీరి
కరముల దెమల్చి యెల్లర గలిసియాడె
పదియు నార్వేల చెలుల గోపాలుడట్లు.

భావ యవనికపై సాక్షాత్కరించు మోహనదృశ్యము నకు పద్యరూపమాయున్నట్లున్నది. చివరి పంక్తియందలి ఉపమానమున భావమునకు జీవము పోయుచున్నది.

తరుణ భాస్కరు గవియు కొందలము నొంది
నళిని అరవిచ్చి విచ్చి పూర్ణముగ విరిసె
చెలుడు ప్రియురాలి యెడద అచ్చెరువునొంద
పుణికి పుణికి హస్తమ్ముల ముదము గూర్చె

ఈ రసాదర్శము నందలి ప్రతి పద్యమొక మధుర భావ చిత్రమనుట కిట్టి నిదర్శనముల నెన్నింటినో చూపవచ్చును.

అపహృత కావ్యమునందలి పద్యములలో చిత్తు ప్రతియందు లభ్యపడినవానినే వెంకటరత్నముగారిందు చేర్చినారు. లబ్ధములైన పద్యములే యిట్లు రసభాండములై అలరారుచుండ నన్నియు దొరికినచో - కాక - కావ్యమే అపహృతముగాకున్నచో నెట్లుండెడిదో! యోచింపుడు.

నవీన కాలమున పద్య కవితపట్ల ప్రగాఢాభిమానమునుగల్గించిన పూజ్యులలో తిరుపతి వెంకటకవులు ప్రధమస్థానీయులు. అష్ట, శతావధానాలతో - పద్యోపన్యాసాలతో, రాజాస్థానములందేగాక సకల హృదయాస్థానములందు గూడ గౌరవ పీఠముల నేర్పరచుకొనిన ఘనత తిరుపతి కవులదే. ఆజంట తెలుగుతల్లియింట పద్యగద్య రూపాత్మకమైన బంగారు పంటను బండించినది. వారి అనుంగు శిష్యుడు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

గురువుల కన్ని విధముల దీటయిన శిష్యుడుగా పదుగురిలో బాల్యముననే ప్రఖ్యాతి గన్న విద్వత్కవి కిశోరము. శ్రీ శివరామ శాస్త్రిగారి అంతేవాసి మన వెంకటరత్నము గారు. వారికి కవితా జీవితమున కలిసి వచ్చిన మహాదృష్టమది.

ఈ దృష్టితో పరిశీలించినపుడు జగత్ప్రసిద్ధులయిన తిరుపతి కవులకు వెంకటరత్నము గారు ప్రశిష్యులగుదురు. కావుననే ఇంగువ గట్టిన గుడ్డ యనిపించుకొనునట్లు కవితా వ్యవసాయమును కొనసాగించినాడాయన. వెంకటరత్నము గారి గురుభక్తి అపారము. శివరామ శాస్త్రిగారి పట్ల తనకు గల అసాధారణభక్తి ప్రపత్తులకు చెరగని చిహ్నముగ వారు రచించిన పద్యమును బరిశీలింపుడు.

తెనుగు గవిత్వమాధురుల తేనెపెరన్ సృజియించి యిచ్చి పోయిన తిరుపత్యభిజ్ఞుని యభీష్టము దీర్చు రసార్ద్ర సాహితీ వన వనమాలి; మా గురుని; వ్యాకరణాబ్ధిసమోఘకావ్యధాతను శివరామ సత్కవిని తత్పదపద్మములన్ స్మరించెదన్

కవిత్వ మాధురుల తేనెపెరలను సృజించు వారట తిరుపతి శాస్త్రిగారు. తిరుపతి శాస్త్రిగారి అభీష్టము దీర్చు రసార్ద్ర సాహితీవన వనమాలియుట, వ్యాకరణాబ్ధియుట శివరామశాస్త్రిగారు. గురుదేవునింత గొప్పగ శబ్దచిత్రమున సాక్షాత్కరింపజేసిన కవిచంద్రుడు వెంకటరత్నము గారు. తత్పదపద్మములన్ స్మరించి అమోఘ కావ్యవిధాతృత్వము నవలీలగ గైవస మొనర్చికొనిన మధుర సారస్వత స్రష్టయని వెంకటరత్నము గారిని - వారి కావ్య సంతతిని గుర్తించిన వారందరు ననగలరు. గురువులకు - గురువుల గురువులకు గూడ గురు ముదమును గూర్పి గల్గి గురుకీర్తిని గడించుకొనిన సురుచిర మనస్వి వెంకటరత్నముగారు.

బ్రిటీషు ప్రభుత్వపు కొరడా భారత భూ భాగము మీద విచ్చలవిడిగా సంచరించే రోజులలో వెంకటరత్నము గారు జన్మించారు. తెలుగు గడ్డమీద స్వాతంత్ర్యవీరులు వినిపించిన - పూరించిన; శంఖారవాల నాయన విన్నారు. ఉద్యమాల ఊపులో ఉత్తేజితమైన హృదయ మాయనిది. కడగండ్ల పాలయిన స్వరాజ్యయోధుల కన్నీటి చారిక లాయనను ద్రవింపజేశాయి. శాంతియుతమైన స్వాతంత్ర్య రణమున తానుగూడ సైనికుడుగా విహరించాలని యువ్వి ళ్ళూరని క్షణాలు గూడ లేకపోలేదు. ఆయనలో రగుల్కొ నిన స్వాతంత్ర్య భావజ్వాలలు వాడిగా వేడిగా వారి లేఖిని నుండి బయలువెడలి పాఠకులను ప్రబోధించిన సన్ని వేశము లెన్నియో కలవు. ముఖ్యముగా తెలంగాణమున చెలరేగిన పాశవిక విద్రోహశక్తుల పన్నాగాల మధ్య నైజాం రాక్షస రాజ్యకాంక్షల మంటలనడుమ శలభముగా మారి మలమల మాడిన ఘట్టము లెన్నియో వెంకటరత్నము గారి అనుభవము నందున్నవి.

కావుననే వారిలో ఈ అనుభవాల కూడలిగా సలసల మరగిన గుండెనుండి - దేశభక్తి ప్రపూర్ణములయిన ఖండి కలు గూడ వెలువడినాయి. సమయము వచ్చినపుడెల్ల స్వాతంత్ర్య భావరేఖాదీప్తులను వెల్లివిరియించెడి సాహిత్య సృష్టి వారు చేశారు.

సత్యమహింసయున్ మిగుల చక్కని సూత్రములంచు బాపుజీ
నిత్యము సంస్మరించి యవనిన్ విడిపోయెను-నమ్మినాము రా
భృత్యులమౌచు భారతము ప్రీతిమెయిన్ దిలకించి చూచుమా
సత్యమహింసయున్ బలి నొసంగుము ధర్మము చెంతనంచనున్

ఇది ప్రజారాజ్యమిందెవ్వరిదగు ప్రభుత
నోరుగలవానిదే - కాని ! నోరులేని
మాయనెరుగని కృషివయ మనుజతతికి
లాభముండదు ప్రభుత కల్గదు జగాన !

వెంకటరత్నముగారు చెప్పదలచిన దానిని చెప్పు టకు వెనుకాడని తత్త్వము గలవారు.

మనదేశమ్ము దరిద్రభూమి ధనికుల్ మాత్రమ్ము పాషాణులా?
చెనకం గానలె నేమి కుత్తుకలపేచీలుండ గానిమ్ము శాసన
ముల్ చేయుటతో ప్రశాంతముగ విశ్వశ్రేయమేకూడు శాం
తిని పోగొట్టి యమాయక ప్రజల నార్తింబెట్టనేమౌనురా ?

భారతమన్నదే పరమ పావననామము దాని పుత్రులె
వ్వారలకైన కొత్తలగు బాటలు జూపుచు శాంతినిల్పి యీ
ధారుణి సర్వులన్ సమవిధమ్ముగజూడ సమర్థులన్న దె
వ్వారలు చూచినన్ చరితపై గనుపట్టును శుద్ధ సత్యమై

'ఓటర్లకొకమాట' అనెడి చిన్న పొత్తమున వారి యాలోచలిట్లు సాగినవి. కొన్ని విషయములను చెప్పవలసి వచ్చినపుడు వెంకటరత్నముగారు గావుగుండెతో నిష్కర్షగ వచించుట మన కబ్బురమును గూర్చును.

"త్యాగము లేని నాయకుల దాహము కోసము పేద రక్తముల్ వాగులుగా స్రవించుటకు పాపములేమొనరించిరీ ప్రజల్" ఇట్టి ప్రశ్నను లోకముపై విసురుటకు దగిన దమ్ము వారికున్నట్లు – ఇందలి పద్యములు సాక్ష్యమిచ్చుచున్నవి. "పదవులనున్న వారలకొ పత్రికలన్ నడిపించు వారికో పదియయిదిచ్చు వారలకో! బంటులుగారచియింపకు" డవి–ఆయన కవులనుగూర్చి యెలెత్తి చాటినాడు. అట్లు వ్యవహరించనివాడు గనుకనే ఆయన యిట్లు చెప్పగలిగినాడు.

"సౌహృదము వెలార్చి మా కవులు
రేగిన – లోకము నాకమౌనని"

కంఠోక్తిగా చెప్పినారు వెంకటరత్నముగారు,

సూటిగ కవిని హెచ్చరించుచు – ఆయన గావించిన ప్రబోధము మహోదాత్తము. శిరోధార్యము గూడ.

"ఓరికవీ! జగమ్ము పయినుండుము పెక్కు దినాలునాలుకన్ జారిన మాటలో జగము చల్లగనుండుటొ! మండి పోవుటో! బేరములేల? నీమనసు పేర్చిన లోతులలోని సత్యవాక్సారములన్ లిఖించుము ప్రశాంతిగ చూడుమునీకు నీవుగా

సెహబాస్ ఏమిగుండెనిబ్బరము ?

"సత్యవాక్స్వరములన్ లిఖించు" మనుచున్నకవి యెడంద యెంత నిండయినదో ! ఎంత లోతయినదో ! ఇంకెంత పవిత్రమైనదో ! యూహించుకొనవలసినదే ! ప్రత్యక్షరము నాత్మ పరిశీలన గావించుకొనుచు వ్రాయు మనుట యిందలి యంతరార్ధము. సత్యకథనము కవితకు ప్రాణమని నిరూపించుచున్న వివరణ యిది.

"ఇంద్రధనువు" "పతాక"యను ఖండికతో తుష్టిని పుష్టిని గయిసేసుకొన్నది. "జెండా జాతికి జీవగఱ్ఱ" సమతా చిహ్నమ్ము సర్వస్వము" కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి భావమిది. అట్టి పతాక ప్రాభవమును, వైభవమును, భక్తితోవర్ణించుటకే పతాక ఖండికను వెంకట రత్నముగారీ ఖండ కావ్యమున జేర్చినారు.

15-8-1947 వ తేదీన స్వాతంత్ర్య సిద్ధి జరుగగనే వారీ శీర్షికను రచించినట్లు సమయము సూచికను బట్టి తెలియును.

నలుబదికోట్ల భారతజనమ్ములు 'జే'యని స్వేచ్ఛనొందుమం గళ సుదినమ్ము నేడు - సమకట్టుటకై ప్రవహించినట్టి ని ర్మల రుధిరాపగా బహు తరంగము లందుకణమ్ములెన్నొ! వి స్తులతర దేశ భక్తుల విశుద్ధ శరీరము లార్చి చిమ్మెనో !

మహావేశ సంభరిత హృదయ కుహరమునుండి ప్రతి ధ్వనులీనిన స్వాతంత్ర్యగానమిది. ఒక్కసారిగా స్వేచ్ఛ సిద్ధించుటకొరకై నిండు మనస్సుతో పెనగిన తర తరాల మహానాయకులను మన తలపున నిల్పు - నిమిత్తము చేసిన సారస్వత ప్రయత్నమిది.

ఆశుద్ధాత్ములు శాంతి నొందుటకు జోహారుల్ సమర్పించి దిగ్దేశమ్ముల్ మన ధర్మచక్రమును గుర్తింపంగ మువ్వన్నెలన్ ప్రాశస్త్యంబును గొన్న కేతనము చేఁబట్టన్ వడిన్ లెండు"

ఉజ్జ్వల ప్రబోధము. మనసు నుప్పొంగించు రచన. కర్తవ్యమును గుర్తింపజేసి కార్యరంగమున కాలిడ జేయు భావన. పతాక పట్ల మనకుండవలసిన భక్తి మొదలయిన వన్నియు నొకదాని వెంట నొకటి మన మనోవీధిలో ప్రత్యక్షమగును.

వెంకటరత్నము గారిని భారతీయ కవుల సరసన నిల్పు ఖండిక యిది. వారి సంప్రదాయ భక్తికి వారి స్వభాషా భక్తికి; వారి స్వసంస్కృతీ భక్తికి తీసిపోనిది వారి స్వదేశభక్తి.

స్వదేశవిముక్తి కొరకు - పరదాస్య విచ్ఛిత్తి కొరకు- స్వాతంత్ర్యసిద్ధికొరకు కలాన్ని బలమైన సాధనముగ నుపయోగించి, సోదర దేశీయులకు విశాల దృష్టిని దేశభక్తిని కలుగజేసి యీ రూపమున వెంకటరత్నముగారు సఫల సంకల్పులయ్యారు.



# చంద్రశాల

కామము వేరు ప్రేమ వేరు — అభిలషింపదగినది ప్రేమ. ఆకాంక్షింపదగనిది కామము. పవిత్రతత ప్రేరణ కాగా బ్రతుకునకు పరమార్థాన్ని చూపునది ప్రేమ. పాశవికా లోచనల అలజడిలో నలిగి పచ్చి స్వార్థము వంకకు ప్రాణిని నడిపించునది కామము. విభిన్న తత్త్వాలు గల యీరెంటి అంతర్యాల వివరణ చిరకాలము నుండి జరుపబడుచునే యున్నది. కాముక దృష్టికి ప్రేమ వీక్షణమునకు గల తారతమ్యమును విజ్ఞులెందరో! ఎన్నియో! తెరగుల వివరించియున్నారు.

కొందరు పావన సభ్యతకు త్యాగలోలతకు ప్రతీకగా ప్రేమను వర్ణించారు. అనాగరక సంప్రదాయమునకు — దారుణ రాక్షస పిపాసకు—తగిన ఉదాహరణముగా కామమును కొందరు చిత్రించారు.

వెంకటరత్నముగారు కామమునకు ప్రేమకు గల అంతస్థుల తేడాను నిర్వచించుటకై సాహిత్య రంగమున సాగించిన సత్కృషియే చంద్రశాల కావ్యముగ రూపు దాల్చినది.

నియమ నిబంధనలకు లొంగి నిరుపమ భావ పరిమళా లను వెదజల్లుచున్న సంప్రదాయసమ్మతములయిన పద్యములు - విధినిషేధముల పట్టింపులతో పనిలేని తెరగున స్వేచ్ఛగ కొనసాగిన గేయములు - కావ్యమున కలగా పులగముగ కలిసి యున్నవి. ఇట్లొనర్చుటలో గూడ కవి యొక ప్రత్యేకాశయమును వెలువరించుచున్నట్లుగ దోచును. పద్య గేయములలో ఉపయుక్తములయిన భిన్నరచనా విధానములు ప్రేమ, కామములకు ప్రతిబింబములా ! కావచ్చునేమో !

ఏది యేమయిన నేమి ! గేయములు గూడ వాని ధోరణిలో నవి ముద్దు ముద్దుగనే యున్నవి. సమాకర్షణీ యములుగనే రాణించుచున్నవి. కామమునకు సైత మాకర్షణ శక్తి విషయమున కొఱతయేమున్నది ?

ముగ్ధ సౌందర్య మధుర సమ్మోద మధువు
ద్రావవదలపోసితిని గాని దాఁటలేని
కాఱడవి గారుకొనిన చీకట్లలోన
జిక్కువడిన పూదీవకై సేత నెఱుగ.

అనెడి ఛందోమయ సాహిత్యముతో బాటుగ-

నీ మనసు నాయందు నిలిచియుండుట జేసి
మనసొక్కటే నీకు మధుర మయ్యెను సతీ !
మంజు యౌవన సుధాగుంజ జీవన ధార
గ్రోల జాలక యేల కోలుపోయెదు చెలీ !

అనెడి ఛందో రహిత సాహిత్యము గూడ సరస మనోహరముగ "చంద్రశాల"లో ప్రతిపాదితమైనది.

జీవికై జీవి ప్రాణమ్ము చేతనైన
స్నేహ ధర్మమ్ము నిలబెట్టి సేవచేయ
గల మహాశక్తి గడియించి కామలతిక
పెంపుగొన్నప్పుడే అది ప్రేమవల్లి

ప్రేమకు కామమునకు గల విభేదరీతిని సమయము దొరికినపుడెల్ల సందర్భము ననుసరించి యిట్లు నిష్కర్షగ నిర్వచించినారు వేంకటరత్నంగారు. కామలతిక ప్రేమవల్లి కాగలిగినపుడే కమనీయము, రమణీయము, గౌరవనీయము కాగలదని చంద్రశాల హృదయము ద్యోతకమొనర్చుచున్నది.

"మనసు నాయందుండి
మరల కున్నదయేని
మగువ కలదొక వాంఛ
మన్నించి తీర్చదే!

చెలియ కొడలునన్ పులకలు పొడమెన్
పలపల సమ్మోద బాష్పము లురలెన్
గాజులందియలు గలగల మ్రోగెన్
మోముదమ్మి నగు మోసులు తొడిగెన్."

ఈ భావ ధార నేమన వలెను ?

చామంతికావకుళ చంపక పారిజాత పున్నాగ జాజి కరవీర కదంబ కుసుమాలు నాసికాపుటాలు సువాసనా సువాసితాలు గుండెలోన దడ కడుపులోన కలత

గమనములో–భావ వివరణలో గమనింపదగిన వ్యత్యాసాలు. సమన్వయానికి అందక – సమాధానాలు కుదరక ––తికమకలు కలిగించే పద గుంభనలు – వ్యక్తీకరించేదేమిటి ?

'రేగిన ముంగురుల్ పొటమరించిన చెమ్మట మొగ్గలున్నొసల్ సాగిన చూపుటల్లులు నిషాకలిగించెడి రూప దీప ధూపాగురు వాసనల్ ఫెళఫెళా రవమీను జరీపుటమ్ము భూషాగణ గల్‌గలా రవళి సాగగ సాగి సుమాంగి వానిపై.

కామము లేనిచో జనుడు కాయము నిల్పగలాడే! కాని నా కామము లోకవృత్తమునకంటె విలక్షణ మద్ది ప్రేమ మంచేమనుజుండు వాకొను నహీనగ భీరతరాత్మ సంస్తుతిన్ ఆమహనీయు మానస మహానరకమ్మది జూడ శక్యమే.

లోక వృత్తమున కన్న విలక్షణమైన ప్రేమకు కామమునకుగల విభిన్నతను వాకొను నప్పుడు పదముల విషయమున నిట దీసుకోబడిన జాగ్రత్త గమనార్హము

పసితనమెల్ల దాటి జిగిప్రాయము చల్లగ జార్చుచుండ మా
నసమున నాకు కావలెను నాకును కావలెనంచు నేదియో
మసలుచు లోకమెల్లెడల మార్గణసేయునదేమి ? కామమే
ముసుగునడాగి ప్రేమమను ముద్దగుపేరున జెల్లుచున్నదే.

"కామమే – ముసుగున డాగి ప్రేమమను ముద్దగు పేరున జెల్లుచున్నదట".

'ప్రతిఫలశూన్యమై మలినభావ విదూరము నౌచు–జీవితో
న్నతి సమకూర్చు భవ్యగమనమ్మును నేర్పునదేని ప్రేమ'

అని ప్రేమకొక చక్కని నిర్వచనము నిచ్చినాడు వెంకటరత్నముగారు.

శీతల చంద్రిక చిన్ని విపంచిక
మధుమయ వీచిక మంజుల గీతిక
కుసుమిత మల్లిక కూజిత శారిక
రమ్య మరీచిక కామ్యము కాదిక

కామ్యము కానిదది —

"రక్తముడుకెత్తి కామముద్రిక్తమగును.
నీతి నియమము న్యాయము ప్రాతిగావు
పశుబల ప్రాభవమ్మది పాలుగొనును"

కామ మదియట —

కామమూలమె యగుగాక ప్రేమవల్లి
రమ్యధామమె యగుగాక లక్ష్యతలము
రాగ రంజితమమగు చాగుబాట
అమృత నిష్యంది జీవితమై తలిర్చు

జీవితమునమృత నిష్యంది గావించు ప్రేమమది.

కాదనకోయీ ! నన్నూ
కావలెనోయీ ! నీవు

భువిరాలిన మొగ్గలు బోసే
ఎదగోసిన నెత్తురు బూసే
చమురో ! యని దీపం వెలిగే
కనుకడవల పానకమిచ్చే
ఒడినిండు నివేదనలాసగే
నా పూజలు కాదనకోయీ !
నీ సమ్మతి కావలెనోయీ !

ఈ ధోరణిలో సాగుచున్న భావవాహినికే పేరు పెట్టవలెనో !

చంద్రశాల మొత్తముమీద గమ్మత్తైన కావ్యము. సంప్రదాయ ఛందస్సులో రచన సాగుచుండగనే గేయము సాక్షాత్కరించును. ఒడిదుడుకులతో క్రమ పరిణామము లేని వర్ణముల కూర్పుతో గేయము నడచుచుండగనే ప్రసిద్ధ

వృత్తి నియమములందొదిగి యొయ్యారముల నొలుక వోయుచు గలగల—తళతళ, లాడుచు కదలి వచ్చెడి సెల యేటిని దలపించు పద్యము ప్రత్యక్షమగును.

కామమునకు గల బలహీనతలు వర్ణితములగుచుండ గనే ప్రేమయొక్క పవిత్రత వ్యక్తీకరింపబడుచుండును. అకళంకమైన ప్రేమ పొంగులలోగల వినిర్మలత యొక వంక - మ్లానమై మాననీయముగాని కాముక దృష్టికి సంబంధించిన కళంకమొకవంక యీ కావ్యమున దోబూచు లాడుచు తోడు తోడుగ పయనించినట్లుగ గన్పట్టును.

"కామమో! ప్రేమమో! కలయొ! జాగ్రత్తయో!
గాఢ దీక్షా పూర్ణఘనత గాంచి!
సౌఖ్యమో! దుఃఖమో! నిశ్చలతయో ?
ఒక విశిష్టానంద సుకృతిగాంచి"

మనుజుడు ప్రణయ యాత్రలో పరమానందము జూరగొనవలయునని సందేశము నందించుచున్న చంద్ర శాల ఎంత వినూత్నమైనదో! అంత విశిష్టమైనదనియును జెప్పవలసియున్నది.



# వివేక శిఖరాలు

ఉదాత్తనామముతో బహువిధాలోచనలు రేకెత్తించెడి యీ గ్రంథము వచన కావ్యము. కావ్యశైలిలో యిందలి వచన రచన కొనసాగుట వలననే దీనిని వచన కావ్యమన వలసి వచ్చినది. మానవతను వివేక శిఖరముల కెక్కించు మహోజ్జ్వల ప్రయత్నమీ గ్రంథమున జరుపబడినది. మానవుడధిరోహింపవలసిన వివేకశిఖరములయౌన్నత్యము, ఔద్ధత్యము పరిశీలనాత్మక దృష్టితో నిందు వివరింపబడి యుండుటచే గ్రంథము సార్ధకనామమున నలరారు చున్నది.

వెంకటరత్నముగారి కవితా జీవిత శిఖరాగ్రమున ప్రజ్ఞామయ కాంతుల ప్రసరించుచున్న మణిదీప మీ గ్రంథము. కాని! ఇది అనువాద కావ్యము అనువాదమని భ్రాంతిపడుటకేని వీలుగనిపించని స్థాయిలో సంగ్రథింప బడిన గద్య గ్రంథము. చదువుచున్నంతసేపు వెంకట రత్నముగారి ప్రతిభా నిరూపక సమర్థ సరసపదజాలమే- ఉతప్రోతముగ నిందు జాలువాఱుటచే నిస్సందేహముగ నిది స్వతంత్ర రచనమనియే యెల్లరు భావింపగలరు.

ఏ మైననేమి? "వివేకశిఖరాలు" అనువాద గ్రంథమే మూలరచయిత శ్రీ ఆనందాచార్యస్వామి. ఆంగ్లభాషలో- ఈ గ్రంథ రచన గావింపబడినది. వంగ దేశీయుడైన శ్రీస్వామి ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య తత్త్వ విజ్ఞానశాస్త్ర ఖనిగా పేరొందిన మహర్షి. హిమాలయాలలో ప్రశాంతమైన ఏకాంతవాసము గావించి బ్రహ్మానందానుసంధాన దక్షతతో జీవితమును సఫల మొనర్చుకొనిన యోగికుల తిలకుడు. ప్రకృతి సంభవములైన పలు వ్యథలతో క్షోభించెడి మానవాళి తప్త హృదయాలకు వారి పలుకులు శీతల స్పర్శా సదృశాలని విజ్ఞులు సిద్ధాంతీకరించారు.

రవీంద్రభారతీ ప్రారంభోత్సవకాలమున బజారున వచ్చుచున్న వెంకటరత్నముగారికి కాలిబాటపై పెట్టబడిన పుస్తకాల అంగడిలో - ఆనందాచార్యస్వామివారి ఆంగ్ల గ్రంథము భాగ్యవశమున ప్రత్యక్షమైనది. బహుశః ఆ గ్రంథ మప్పటికే భాషయందుగాని అనువదింపబడి యుండకపోవుటొక విశేషము. వెంకటరత్నముగారు చదువుటయు, పులిజాల హనుమంతరావుగారిని చదువమని కోరుటయు, వారా గ్రంథమును చదువుటయు, వెంటనే అంబటిపూడివారి ననువదింపమని అభ్యర్థించుటయు వారద్దాని నాంధ్రీకరించుటయు, వినిన వెంటనే శ్రీ పంతంగి వెంకటేశ్వరరావుగారు భారతీయ సంస్కృతీ సంప్రదాయముల పట్లగల విశేష భక్తితో ముద్రణకు బూనుకొనుటయు వెంట

వెంటనే వరుస వరుసగ కలిసివచ్చిన శుభోదర్క విషయ ములు. ప్రముఖ సారస్వత సంస్థయైన సాహితీ మేఖల రజతోత్సవ ప్రచురణగా దీనిని ప్రకటించుటయు మరొక విశేషమే.

ప్రథమ ప్రపంచ మహాయుద్ధ ప్రళయముతో లోకము గగ్గోలెత్తిన పిమ్మట సమాజమునందేర్పడిన దుష్పరిణామముల ప్రభావమునుగాంచి మానవధర్మ సముద్ధ రణ గావించు మహదాశయముతో ఆనందాచార్య స్వామి వారీ తత్త్వ సుధను మానవాళి కందించినారు.

ప్రాచీనకాలపు శక్తివంతములయిన పలుకుల ప్రభా వమును నవీనకాలపు ప్రజల యభ్యున్నతి కొరకై విని యోగించుటొక్కటే యీ ఉజ్జ్వల గ్రంథ రచనకు ధ్యేయ మని యెందరో ప్రాజ్ఞులభినందించినారు. విజ్ఞానవిషయ ప్రకటనమునగాని శైలీ సౌకుమార్యముల విషయమున గాని యీ గ్రంథ రచన రవీంద్రనాథఠాగూరు రచనకు దీటుగ నున్నదనియు కొన్ని సమయములలో - ఊహా ప్రకటనము నందును; భాషా ప్రౌఢిమ యందును ఠాగూరు కవిచంద్రుని రచనను మించినట్లున్నదనియును ఇండియన్ మిర్రర్ పత్రిక 1920 సంవత్సరమునందే తన యభిప్రా యమును వ్యక్తీకరించినది.

విశ్వకవి భావరచనకుద్దిగనున్న - అటనట నతిశయించియున్న - శ్రీ ఆనందాచార్యస్వామి

గ్రంథ హృదయమును తెలుగున విప్పిచెప్పుటలో వెంకటరత్నము గారు సంపూర్ణ న్యాయమును చేకూర్చినారనుటకు వివేకశిఖరాలు గ్రంథమునందలి ప్రతిపుటయు సాక్ష్యముకాగలదు. మూల గ్రంథము పాత పుస్తకాల గుట్టలో నుండి వెంకటరత్నము గారి చేతి కందిన శుభవేళ - ఆంధ్ర భాషలోమహోదాత్త తాత్త్విక గ్రంథావతరణకు సుముహూర్తమగుట తెలుగు వారి మహాభాగ్యము.

ఇతర భాషల సంగతి యేమో! తెలియదు. కాని శ్రీ ఆచార్యుని గ్రంథము తెలుగు భాషలో పరివర్తితమగుటకు మాత్రము వెంకటరత్నము గారే శ్రీకారము చుట్టినారని చెప్పవలెను. తత్త్వవిజ్ఞాన శిఖరముల కెగ బ్రాకిన భారతీయులు వ్రేళ్ళమీద లెక్కబెట్ట తగినంతమంది యుందురా! వారిలో యోగ వీక్షణ వైభవము: ధర్మానురక్తి; సంప్రదాయ గౌరవము గల శ్రీఆనందాచార్యుని వంటి మహర్షి చంద్రుని గ్రంథము ననువదించుటనిన మాటలా!

అందును తత్త్వవివేచనాత్మక గ్రంథమును స్పృశించుట కెట్టి మనోద్రఢిమ యుండవలెను. ఎట్టి ఆత్మ స్థైర్యము కావలెను ? వెంకటరత్నము గారిట్టి సాహసాత్మక

భాషాంతరీకరణ ప్రయత్నమునకుబూను కొనుట యే గాక మనోహర శైలీవిలాస విన్యాసములతో పాఠకుల నాకట్టుకొన జాలిన ధోరణిలో కర్తవ్యమును జయప్రద మొనర్చినారు.

ఆనందాచార్యులవారు కూర్చిన అసమాన వాక్యములను - తాత్త్విక భావ పరిపూర్ణములను - పఠించి; పఠించి; అందలి లోతైన భావపరంపరకు ముగ్ధులగుచు; తన్మయతను గనుచు ; నిద్రాహారములను మఱచిపోయి 'వివేకశిఖరాలు' వెంకటరత్నము గారు సమకూర్చినారని ' పులిజాల హనుమంతరావు గారు గ్రంథారంభమున " ఒకమాట "లో వ్రాసినారు. అందలి ప్రతిమాటయు నక్షరాక్షర సత్యము.

ప్రకృతికతీతమైన మహాశక్తిని - ప్రపంచాతీత దృష్టితో తిలకించి వివరించు ప్రతిభగల వారే మానవత్వపు విలువలను ధర్మసూక్ష్మములను వక్కాణింప నేర్చుదురు. శ్రీ ఆనందాచార్యుల వారి అతిలోక సృష్టిగా ఖ్యాతిగన్న యీ మహిమాన్విత గ్రంథరాజమును - తాదృశమైన అతీతభావనతో తెలుగున రూపొందించిన వెంకటరత్నము గారి శ్రమయు, ప్రజ్ఞయు ప్రత్యేకస్థాయిలో ఎన్నిక సేయ దగినవి. అందువలననే 'వివేక శిఖరాలు' తెలుగున కనువదింపబడిన ప్రకృతిధర్మ ప్రబోధక గ్రంథ పరంపరలో ప్రప్రథమముగ పరిగణింపదగినదిగా పేర్కొన వలసివచ్చును.

ప్రకృతి - మానవుడు - పరమాత్మ యనెడి మూడంశములపై సాగిన యీ గ్రంథము నందలి సుదీర్ఘ చర్చ యంతయు - సంభాషణ క్రమమునను విశదీకరణ పద్ధతి యందును కొనసాగినది.

"ఆచార్య దేవా!" యని సంబోధించుచు వ్యక్తీకరించుచున్న అంతేవాసి సందియములన్నింటికి 'శిష్య చూడామణీ!' యని ప్రారంభించి గురుదేవు డొసగిన ప్రత్యుత్తరము లే యందలి ప్రధానాంశములు.

జీవితమున మానవుని పరమలక్ష్యమెద్ది? ఉత్తమ సత్యముల నన్వేషించుట; సత్యాన్వేషణము వివేకశక్తిపై నాధారపడియుండును. ఆత్మ పరమాత్మల వివేకము గలవారియందు మాత్రమే - ఉత్తమ వివేకము వికాసదశ నందును. అట్టిది వివేక బలము. అట్టి వివేక బలమే సత్యాన్వేషణమునందు మానవునకు సహకారికాగలదు. కావుననే జీవిత పురోగమన స్థితిలో వివేక శిఖరాలు సమధిరోహణ మొనర్చుటకు నరులు సదా ప్రయత్నింపవలయును. కావుననే "అన్వేషణము" అనెడి యిందలి ప్రథమ భాగము నందిట్లు వివరింపబడినది.

"ఉత్తమమైన వివేక మనగా ఉత్తమ సత్యము నన్వేషించుట. ఆ మహోన్నత సత్యాన్వేషణ మొనర్చుటకే- ఇహమునందు మన - ఈ 'మనికి' ఏర్పడినది. మరి! ఆ మహోన్నత సత్యమేమి? దేవుడని చెప్పబడుచున్న బ్రహ్మపదార్థమే."

ఇది జీవితరహస్యము నరటిపండొలిచి హస్తము నందిడినట్లున్న వివరణ గదా! జీవిత లక్ష్యాన్ని అవగాహన మొనర్చుకొనుటకై చిత్తశుద్ధితో యోగ తత్పరతతో చిరకాలమునుండి మానవుడీ మహత్తర రహస్యమును గుర్తించుటకే యత్నించుచున్నాడు. సకలవిధ యోగ సారముల యేకైక లక్ష్యమీ సత్యాన్వేషణయే-ఈ బ్రహ్మ పదార్థ చింతనా లోలతయే.

మహోద్భుత తాత్త్విక భావధారకు - తెలుగు మాట అలో రూపకల్పన గావించుటకై వెంకటరత్నము గారి కలమెట్లు పరవళ్ళు ద్రొక్కినదో! మనము పైన పేర్కొన బడిన వాక్యములలో గమనింపగలము.

వాస్తవముగ - ఆధ్యాత్మిక విషయములను ప్రవచించు సందర్భమున నుపయుక్తమయ్యెడి భాషా శైలీ విశేషాలు ప్రత్యేకతను సంతరించుకొని యుండ వలసిన అవసరమెంతగనో! కలదని అందరు గ్రహించిన అంశమే —

తాదృశ తత్త్వజిజ్ఞాస రచయితవంట - ఇనికి యుండుట ముఖ్య విషయము. జ్ఞాన ప్రబోధకములైన భావ విహంగాలు పాఠకుల మనో వియన్మండలమున స్వేచ్ఛగ పయనించుటకు సర్వవిధముల శక్తివంతము లయిన పదములనెడి పక్షములు ప్రధాన సాధనాలు. ఱెక్కలు బలిష్టములుగ నున్నపుడే పక్షులు పరుగుపందెము లలో పరమార్థాన్ని సాధిస్తాయి.

భావ విహంగాల పద పక్షాలకు జవ జీవములను గూర్చగల దిట్టతనము రచయితకున్నప్పుడే - ఆయన ఊహించిన రీతిగా తరతరాల తరువాత మాత్రమే గాక - యుగ యుగాన్తరాల పిమ్మట గూడ - భావ విహంగాలు సమాజ జీవితాకాశమున సంచరించ గలుగుతాయి.

పద సంపదకట్టి పుష్టిని స్ఫూర్తిని కలుగ జేయగల రచయిత వెంకటరత్నము గారు. కావుననే చెప్పదలచినది వేదాంత విషయమే కావచ్చును. కాక, లౌకిక వ్యవహారమే కావచ్చును. భావ ప్రకటనకు సన్నద్ధుడై ఆయన సమాధి నిష్ఠితుడైన యోగి రాజు వలె కలము పట్టగనే - తదను గుణములైన పదములన్నియు వారి చుట్టును జేరి 'మమ్ము ప్రయోగింపుడు, మమ్ము ప్రయోగింపు'డని అభ్యర్థించు చున్నట్లుగ దోచవలెను. వెంకటరత్నము గారు పద ప్రయోగ విషయమున మిక్కిలి గడుసరి. ప్రతిమాలిన పదములన్నిటి పట్ల - ఆయనకు దయకలుగదు. అవి - అట్లాయన పాదముల బట్టి ప్రార్థించుచునే యుండును. వారు క్షణములో తనచెంత జేరిన పదముల బలా బలాలను బేరీజువేసి - విలువలు తేల్చగల షరాబు పని చేసి - ఒక నిర్ణయమునకు వచ్చి - అప్పుడు పదస్వీకార ప్రయోగాది కార్యక్రమము లకు గడంగును. అదొక మహాద్భుత తపోలీల. ఈ వ్యవహారమంతయు వివరించుట కయిన యాలస్యమున కన్న - తక్కువ సమయములోనే పూర్తియగును. తరువాత

తయారైన వాక్యమును మనము దర్శించుదుము. వాక్యమును పాఠకుల మనస్సనెడి రంగభూమిపై నటించెడి ప్రసిద్ధ నటునితో బోల్చుకొన్నచో నటుని ఆంగికాహార్యములను నవనవోన్మేషముగను, పాత్రౌను గుణముగను, కనుల జిగేల్మనిపించునట్లుగను తీర్చిదిద్దు రూపశిల్పిగా వెంకటరత్నముగారిని మనము సంభావింపవచ్చును. రూపక ప్రదర్శనము సకల మనోరంజకముగ జయప్రదము గా వలెననినచో - నటులకన్న మిన్నగ; రూపశిల్పి బాధ్యత వహించవలసి యుండుట కాదనరాని విషయము. రెండు వాదనలకు తావు లేని అంశము. "వివేకశిఖరాలు" దృశ్యరూపక మనుకొనుడు. రూపశిల్పిగా వెంకటరత్నము గారు కృతార్థులైనట్లే.

"ఐహిక జీవితము యొక్క లక్ష్యమేమియో : అర్థము చేసికొనుటకు యత్నింతము. మనమేడనుండి వచ్చితిమి? ఎందుకు వచ్చితిమి? కొంచెము కొంచెముగానే జెప్పుదానిని నీవర్థము జేసికొన యత్నింతువేని వెలుగు చిక్కగలదు. ప్ర ప్రథమమున భాష కొంత ప్రతి బంధకముగ నున్నట్లుండినను - కాలము వెంబడి ఆ యాటంకము నతిక్రమించి సత్యమును నీవు గ్రహింపగలవు"

గురువు శిష్యునకు బోధింపబూనిన తెఱగిది. పని వానిచే తల్లిగోరుముద్దల దినిపించుచున్నట్లుగ లేదా? జటిల

వేదాంత విషయములను సరళ ధోరణిలో - అందరి కెఱుక పఱుప వెంకటరత్నముగారు భాషావిషయికముగ నిట్టి పంథా అవలంభించిరి.

ఈ గ్రంథమునందలి అధ్యాయములన్నియు విభిన్న నామములతో విశ్లేషింపబడి ప్రధానాంశమునకు చెందిన భాగములై అలరారు చున్నవి.

"గాన రూపముగ నభివ్యక్తమైన ఈశ్వర ప్రేమయే మన జీవితము. మన జీవితమునకు మూలమిచటలేదు. అది స్వర్గమునందున్నది."

"ధ్యానము" — అనెడి శీర్షిక క్రింద యిట్టి వివరణ ప్రారంభమగును. జీవితమును స్వర్గతుల్యమొనర్చ కొననెంచితివా! తదనుభూతినంద నెంచితివా! అయినచో ధ్యానము నాశ్రయింప వలసినదే. జ్ఞానము కొరకు—సర్వ ప్రపంచమును ప్రేమించగల దయార్ద్ర హృదయము కొరకు — ధ్యానము మనకవసరము. మానవాళినంతటిని ప్రేమసుమస్రజముచేబంధింపవలయుననిమనమభిలషింప వలసియున్నది. నరునిలో ఘనీభవించియున్న అహంకార మనెడి లోహమును విశ్వక్షేమమనెడి మూసలో కరగింప వలసియున్నది. అట్టి త్యాగభావము నలవరచుకొనుట కొరకే యోగులు నిరంతరము తపించుచుందురు. "త్యాగము" అనెడి భాగమున మానవతను ఫలింపజేసెడి అమృతప్రాయములైన ఇట్టి సూచన లెన్నియో పొదుగ బడియున్నవి.

పదునెనిమిది విభాగములతో గూడుకొనియున్న "వివేక శిఖరాలు" ప్రతి విభాగమునందును మహోదాత్త విషయములనే వివరించుచున్నవి. అమృత రహస్యములనే వెలియించుచున్నవి.

క్రమాభివృద్ధినే సూచించుచున్నవి. దర్శింపదగిన యే దివ్యరూపమునో సాక్షాత్కరింపజేయుటకు సహకరించుచునే యున్నవి.

"ఆయుష్మంతుడా! నేనిప్పుడు నీకు సంగ్రహముగ ఆత్మోద్ధరణ శాస్త్రసారమును బోధించితిని. అది దివ్యమైనది. పవిత్రమైనది. లోకక్షేమము కొరకు నీకు చెప్పితిని. దీని వలన వీలయినంతగ బాగుపడుము. నిరంతరము దేవుని ధ్యానింపుము. ఆ ధ్యానమువలన ఈ బోధ జ్ఞానవంతులకు; ఉత్తములకు పరిశుద్ధులకు చేరుగాత!!"

అనెడి గురువాక్యములతో ఉన్నత స్థాయికి శిష్యుని మనస్సును చేర్చుచున్న ఈ గ్రంథము బరువైన భావములతో పూర్ణ జలగర్భయైన తటాకము భాతి - తళతళలాడుచున్నది. ఈ సరస్సునందే రేవున దిగినను మధుర జలధారల జుఱ్ఱవచ్చును. గఱ్ఱున త్రేన్చ వచ్చును. బుద్ధియందిముడ్చుకొనుటకు దగిన మేధాబలము కావలెను. పదునెనిమిది విభాగములయందలి దివ్యసిద్ధాన్తములు-పదునెనిమిది అధ్యాయములతో నిండియుండి యుగ యుగాన్తరములనుండి భక్తకోటి హృదయములంగల యజ్ఞాన

తిమిరముల నడంప-జ్ఞానదీప్తుల వెల్లివిరియింప-కొండంత అండగనున్న 'భగవద్గీతను' దలపించుచున్నవి. ఈ అత్యద్భుతానుభవమును తెలుగువారికి గలుగజేసిన మహనీయులు వెంకటరత్నముగారే.

మొత్తము మీద" వివేకశిఖరాలు" విలక్షణ గ్రంథమను మాట నిర్వివాదాంశము ! భాషాంతరీకరణమైనను స్వతంత్ర రచన పగిది విరాజిల్లెననుటయు సత్యమే. వెంకటరత్నముగారి వచన రచనా చమత్కృతికిది నికషోపలమనుటయు సమంజసమే. తాత్త్విక భావ సింధురమైన యీ గ్రంథము పాఠకుని శ్రమ పెట్టక సానురాగమున చదువజేయుననియు - తాదృశసౌలభ్య మీ ఆధ్యాత్మిక గ్రంథమునకు రచనా సౌకుమార్యము వలననే సిద్ధించెననుటయు న్యాయసమ్మతమే.

ఈ సందర్భమున అనువాదకర్తగా వెంకటరత్నముగారు చూపిన ప్రతిభ అడుగడుగున ద్యోతకమగుచు వారికిగల భాషా నిష్ణాతృత్వమును జాటుచున్నదని మరొకసారి నిర్ద్వంద్వముగ బేర్కొనవలెను.



# శాంతి తీరాలకు

పద్య రచనలో ప్రజ్ఞజూపుటొక యెత్తు. గద్య కృతులలో విభవమును విరియించుట వేరొక యెత్తు. పద్యములను గేయములను పెనవైచి పేనుట మరొక యెత్తు.

కాగా కేవలము గేయ సృష్టితో భావములకు రూప కల్పన మొనర్చి కావ్య ధర్మమును గలిగించుటన్నింటి కన్న భిన్నమైన యింకొక యెత్తు. వచన గేయ కృతులలో నిట్టి స్వారస్యమును సాధింపగల్గుట భావించినంత పరమ సులభము గాదు.

అల్పాక్షరములతో - అనల్పార్థ సమావిష్కరణము చేయుట యందు చేయి దిరిగి యున్న రచయితలే యిట్టి ప్రక్రియను చేపట్టగలరు. ఛందో నిబంధనల వలన సముత్పన్న మయ్యేడి సొబగైన నడక కిచట తావులేదు. భావ ప్రతి పాదనకు నిరోధకములు గాని - అంత్యాను ప్రాసలతో ఆలోటును రచయిత పూర్తి చేసికొనవలసి యుండును. అనుప్రాసల వీరావేశము - వెట్టి పోకిళ్ళకు; నిరర్థక పదప్రయోగములకు; తావీయని రీతి కనుగలిగి

వ్యవహరింప వలసిన బాధ్యత కవిమీదనే యున్నది. వచన గేయ రచన; నల్లేరు మీద బండివలె నడచునది కొద్దిమంది చేతులలో మాత్రమే. ' అదొక తమాషా పని ' అనుకొనుట వెఱ్ఱి తనము.

కవి భావాలను కవచాల మాదిరి తొడుగు కొనడానికి; కావ్య రూపాన్ని దాల్చడానికి - పదాలు ఎదురు తిరుగుతాయి. పదాలకు పగ్గాలు వేసి వానిచేత ముద్దయిన మొగ్గలు వేయించగల నిపుణుడైన కవికే వచన గేయము చెప్పిన మాట వింటుంది. ఈ దృష్టితో ఆలోచించినపుడు వచన కావ్య సృష్టి అసాధారణమైన అంశమని అంగీకరించితీరాలి. కాని ! ఈ అసాధారణ కవితా ప్రక్రియను వెంకటరత్నము గారు సమర్థవంతముగ ; రసవత్తరముగ నిర్వహించిరనుటకు ' శాంతి తీరాలకు ' అనెడి కావ్యము సాక్ష్యముగా నిల్చును.

ఈ వచన ఖండకృతిలో పదాలతో బంతులాట లాడిన వెంకటరత్నముగారి శబ్దాధికారము మనకు ప్రత్యక్షమగును.

" నాటినుండి నేటివరకు గల సమస్యలను విశ్లేషించి సారభూతములయిన సమాధాలను చూపిన వ్యంగ రచన " అని యీ వచన కావ్యమును పరిచయము జేయుచు ధవళా శ్రీనివాసరావు గారు వ్రాసిన " ఒక మాట. " నిజమైన మాటయే.

ప్రముఖ తత్త్వవేత్త అయిన శ్రీ ఆనందాచార్యుల వారి యూహల సంపుటి యీ వచన కావ్య సమావిర్భావమునకు మూలమగుట - పసిడికి తావి అబ్బినట్లయినది. " భరత పుత్రుల ప్రార్థన " అనే శీర్షికలో ప్రసారితమైన భావ పరంపర మనలనే తీరున ఆ లో చ న ల వంకకు నడిపించునో ! చూడుడు.

స్వాతంత్ర్య పరిరక్షకులు
కొండల వంటి దండి మగలు - సేవింపగా
నరనాయకు డొకడు
నక్షత్ర లోకాలనుండి
దిగి రావాలని మనం ప్రార్థిద్దాం.

మంచి ఊహ అవసరమైన ఆలోచన.

తుచ్ఛమైన అహంకారాల చేత
ద్రవ్య జన్యాలయిన నీతుల చేత
వ్యాపారం జేసే మతాల చేత
మలినమైన భ్రష్టమైన - ఈ భూమి
ప్రక్షాళితం కావాలని మనం ప్రార్థిద్దాం.

ఇది ఆశ పడదగిన అంశమని వారి సిద్ధాంతమువారికి సంస్కృతీ సంస్కారాల పట్లగల భక్తిపలికించిన పలుకులివి.

" జ్ఞానం - శాంతి కళకూ; సౌందర్య శాస్త్రానికీ;
ప్రేమ కారుణ్య తత్త్వానికీ ;

జీవం పోయాలని మనం - ప్రార్దిద్దాం.

మహాకవుల యోచనలు సాగవలసిన తీరేయిది. కాదా !

కులానికీ స్నేహితునికీ మధ్య
స్నేహితునికి స్నేహితునికీ మధ్య
మనకూ మనదైవానికీ మధ్య
విభేదకుడ్యాలు నిర్మించేవాళ్ళ
విధ్వంసం కోసం మనం - ప్రార్థిద్దాం.

యోగ్యతలను గుబాళించెడి యిట్టి ప్రార్థన అందరి ఆమోద ప్రమోదాలకే పాత్రము కాగలదు.

తల్లులకు కొడుకులుగా పుట్టిన మీరు
నేనెప్పుడు పుట్టానని అడుగుతారు ?
నేను పుట్టుక లేని వాడను
ఆరి పోయిన అగ్నులు గల
ఏ మొదటి ఆదిత్యుని అస్థికల నుండి
ఈ దిన నాధుడు ఉద్భవించాడో !
ఆవృద్ధాదిత్యుని - అదితి కనడానికి ముందే నేను
పుట్టాను.

అయినా ! నాచూపుకు దగ్గఱలో
నిర్మేఘాకాశం మీద
ఎత్తున వస్తున్న ఉషః కుమారివలె
నవ నవలాడే పసివాడనే నేను.

బాగున్నది. ఈపాటికాయన యెవరో! తెలిసియే యుండును. వాచ్యముగా చెప్పవలసిన అవసరమే లేని భావ స్ఫూర్తితో కవి భావనకు పదాలు రూపుదిద్దాలి. " నేనెవరిని " అనే కవితలో పై పంక్తులు సాహిత్య సౌరభాలను విరజిమ్ముతున్నాయి.

" ఆత్మ మహాసముద్రం " అనునది మరియొక చక్కని గేయము.

" నేను నా ఆత్మ అనే మహా సముద్రములో మునిగి ఆ లోతుల్లో - ఐక్యత, ఆవేశం, అమృతత్వం అనే రత్నాలను - చేపలను వెతికినట్లు వెతికి పట్టుకుంటాను ".

ఆర్ష ధర్మ పరిపాలనలో గల ఆత్మ — ఆధ్యాత్మిక తత్త్వ మధురిమలను రుచి చూచిన ఆత్మ - పలుకవలసిన పలుకులే పలుకును. ఈ కవితలో వెల్లడింపబడిన భావములన్నియు, - ఈ స్థాయిలోనే యుండుట విశేషము.

ఈ వచన కృతిలో శతాధిక శీర్షికలున్నాయి. దేనికదే విలక్షణమైనది. విభిన్నాంశాల మీద కవి గావించే భావ వివరణ భిన్నభిన్నముగనున్నట్లే - ఆయా సందర్భాల యందుపయోగింపబడెడి భాషగూడ విభిన్నతనే వరించింది. ఇతివృత్తానుగుణముగ భాష మార్పును పొందుట గడిదేరిన కవియొక్క హస్తలాఘవ విశేషము. " వాంఛ " అనే రచనలో కవి ఊహలీ విధముగ సాగాయి.

సాధారణముగ ఆకాశములో
వెలుతురు లేకుండా ఉన్నప్పుడు
ఇసుకల్లో వేడి లేకుండా ఉన్నప్పుడు
నా హృదయంలోని స్మృతియొక్క
స్వప్నలతా నికుంజానికి
చేరువగావస్తూ వుంటావు.

మరొక గేయంలో —

అరుణోదయ వేళ విశ్వం నిద్రిస్తున్నది.
ఆవల రత్నద్వారం గుండా సత్యజ్యోతి ప్రకాశిస్తూ
తొంగి చూచింది.
జీవంతో నిశ్చలంగా నిండిపోయి
వాయువు
జరిగిపోయిన స్రష్టలను గూర్చిన
కలలు గంటూ మైమరచింది.

కొన్ని చోట్ల భావాలకు పరస్పర సమన్వయము కుదరదు. కాని సామూహికముగ-ఏదో అవగాహన కావడాని కయినా ప్రయుక్తపదాలు సహకరించాలి. వచన గేయమున పాఠకున కెదురయ్యేడి ప్రధాన సమస్య యిది. కాని! వెంకట రత్నముగారి గేయాలలో శబ్దస్ఫూర్తి - యీ అవరోధాలను తొలగించుటలో పాఠకుని మురియించ గలుగుతుంది.

సాక్షులు — అనెడి కవిత కావ్యధోరణి వంకకు మన మనస్సులను నడిపించు వైఖరిని గమనించుడు.

ఈ నీలాకాశమూ - ఈ జ్వలత్సూర్యుడూ
ఈ నిశ్చల వాయువూ - ఈ నిరంతర విస్ఫురద
సికతా తలమూ
ఇదంతా నామదేవతా పీఠం
ఇక్కడ ప్రేమతో ఆత్మపూజా పుష్పాన్ని
సమర్పిస్తాను,
ఈ విశ్వ మనే దేవగృహంలో
అహోరాత్రాలనే దీపాలు వెలుగుతవి.

ప్రత్యక్ష దైవాలుగా భావింపబడెడి సూర్యుని వాయువును దేవతాపీఠము మీద నిలిపి-అహోరాత్రాలనే దీపాల వెలుతురులోఆత్మపూజా పుష్పాన్ని సమర్పించుకొను భారతీయధర్మనిష్ఠాపరుడు మనకీ పంక్తులలో సాక్షాత్కరించుచున్నాడు.

రాత్రి మూడో గస్తీ తిరిగే వేళ —
జపమాల చేతబట్టి, ధ్రువతారల వంటి
సహస్ర నామాలు జపిస్తూ నిలబడ్డాను.
మధ్యాహ్న భాస్కరుని గురించి కలలు గంటూ
వాయువు - చల్లని ఎడారి ఇసుకల మధ్య పడి
నిద్ర పోతున్నది.

ఒక క్షణంలో నుండి మరొక క్షణంలోకి
వెలుతురు — ఉల్కరూపంలో
ధనుస్సు మాదిరి దూకుతున్నది.
ఇది ఎక్కడనుండి పుట్టుతున్నదో :
అది అగోచరావరణం
ఎక్కడ పడి కరిగి పోతున్నదో
అది అగోచర తమస్సు
అక్షర మూలంనుండి క్షరసందేశాన్ని
అందించడం దాని వంతు.

మహాద్భుత భావ ప్రవాహము. అంతర్దృష్టితో సంయమి చంద్రులు సాగించే ఆలోచనకు ప్రతీకగ యీ రచనలో వెంకటరత్నము గారి వాక్య విన్యాసము కూర్చబడినవి.

" రాత్రి మూడో గస్తీ " అనగా —
జీవితమున వార్థక్యదశయా : సహస్రనామములు సర్వేశ్వరునకే గదా! జపమాల దాల్చి ఆ వయస్సులో ధ్రువతారల వలె మెరిసెడి నామములను స్మరించుట విద్యుక్త ధర్మమని బోధించుటయా : ఇది.

" మధ్యాహ్న భాస్కరుని గురించిన
కలలు గంటూ. "

అనగా యౌవనపు పొంగుల ఉద్ధతిని స్మరించుకొనుటేమో : గడచినదానిని వల్లెవైచుచు అక్షర సందేశము నందుకొనుటకు యత్నించమని ప్రబోధము గాబోలిది.

" కోశాగారం " అనునది మరొక శీర్షిక.

అక్షర పురుషుడు ప్రతిరోజూ
తన జగత్తును వెలిగిస్తాడు
ఆయన కన్నులతో నేను;
నన్నూ - ఈ ఎడారినీ చూస్తాను.

పెద్దపుటల మొనళ్ళవంటి ఆకారాలను
అస్పష్టంగా దాల్చిన మేఘాలు
చూస్తుండగానే కరగిపోయి
నా కళ్ళముందు - నిత్య
నిర్మలాకాశమే మిగిలింది.

వచన కవితా రచనలో గల లగువు బిగువులను వెంకట రత్నముగారు బాగా అవగాహన జేసుకొనిన అనంతరమే ఆత్మ విశ్వాసముతో - ఇట్టి వచన కావ్యాల రచన కుపక్ర మించియుంటారు.

పలువురనుకొనెడి రీతిగ నిది సామాన్య ప్రక్రియ మాత్రము కాదు. శబ్ద సంస్కారము సర్వతోముఖముగ గల వెంకటరత్నముగారి వంటి వ్యక్తులు తపస్సుగ కొన సాగింపవలసిన కవితా లీల యిది.

రాత్రి ముఖం త్రిప్పింది
దాని నుదుటి మీద
ఉషస్సు వీడ్కోలుముద్దు పెట్టింది.

వాక్పర్వత శిఖరమునుండి
సందేశ శబ్దము వస్తుందేమో ! అని
ఎదురు చూస్తూ కూర్చున్నాను.

రమ్యత ఉట్టి పడెడి యిట్టి పంక్తులను కూర్చుటకు – కేవల పదముల పొందిక మాత్రమే చాలదు. ఎన్నో ఆవేశాల; మరెన్నో అనుభూతుల – మరింకెన్నెన్నో ప్రాక్తన గ్రంధ పఠన లబ్ద లలిత గంభీరానుభవాల, లావణ్యాల సరస సమ్మేళన రూపక సారస్వత ప్రజ్ఞ గావాలి.

"పంట సరకులబండి" ముచ్చటయిన పేరు.
రచన గూడ ముద్దు ముద్దుగనే సాగింది.

ఈ ఎడారిలో నా సంవత్సరాలకూ
నెలలకూ, రోజులకూ పేర్లు లేవు.
అనేక అంతస్తులున్న కాల గోపురం యొక్క
పరిజ్ఞానం కలగడానికి యిక్కడ
గడియారం గానీ; పంచాంగం గానీ;
ఇంకే కాలమానంగానీ లేదు.

పంట సరుకులెత్తిన బండికి కట్టిన
నల్ల తెల్ల రెండెద్దుల వలె సాగి పోతున్న
అహోరాత్రాల గురించిన ధ్యానం తప్ప
నా హృదయానికింకేమీ తెలియదు.

జీవిత ఫలాల పంట సరుకును మోసేది బ్రతుకు బండి. ఈ బండికి కట్టిన నల్ల తెల్ల రంగు గల జోడెడ్లే అహోరాత్రాలట.

అహో ! రమణీయ రూపకము. వాక్యముల నా స్థాయిలో - అల్లగలిగితే గేయమైన నేమి ? పద్యమైన నేమి ? గద్యమైన నేమి ? "వాక్యం రసాత్మకమ్ కావ్య" మని గదా ! రసతత్త్వవేత్తల నిర్ణయము.

## "జగడమాడుకొనే పూజారులు"

వెంకటరత్నము గారు శీర్షికలలో గూడ కొన్ని సందర్భములలో నిట్లే గడుసుతనమును చిలకరిస్తుంటారు.

"ఏకమేవా ఽ ద్వితీయం బ్రహ్మ" మనెడి దివ్య సిద్ధాన్త ప్రవచనకు వీనులొగ్గుట నిజమైన భక్త లోకమునకు నిచ్చుట మోదమును గూర్చెడి యంశము. తాదృశ పవిత్రాలోచనయే కావలెను - భగవత్తత్వమును గూర్చి, రూపమును గూర్చి సంఘర్షణ చెలరేగుట శోచనీయ విషయము. నామ భేదములతో, రూప భేదములతో పూజించెడి పరమాత్మ యొక్కరే .... ఈ విషయమున నిరుపయోగకర నిర్హేతుక వాదములతో మానవాళి మధ్య మహాగ్ని జ్వాలలు విజృంభించుచుండుట చరిత్ర మనకు స్పష్టీకరించుచున్న సత్యము. వాస్తవమున కట్టి వైరుధ్యము భగవానుని విషయమున ప్రజలలో వ్యాపించుట అవివేకమే.

ఆలయాలలో, చర్చిలలో; మసీదులలో
చైత్యాలలో
వాళ్ళు అలంకరించే - ఆ ఇష్టమూర్తి ఎవరు ?

హృదయాలలోని వానినే తెలుసుకొనలేకుండా - ఆలయంలోని పూజారితో మసీదులోని పూజారితో కుస్తీ పట్టు పట్టుతున్నాడు.

పురుషోత్తముణ్ణి - గీతలో, బైబిలులో, ఖురానులో - త్రిపిటకములో —

వెతకి - వ్యర్థులైన పూజారులారా ?

ఆయన్ను మీ మీ హృదయాల్లో, మీ ప్రక్కనున్న వారి హృదయాల్లో —

వెదకండి - కనబడతాడు.

" ఓ మిత్యేకాక్షరం పరం బ్రహ్మ " అనెడి మాటలో గల పరమార్థాన్ని ప్రబోధించే దివ్య భావన యీ గేయానికి జీవము పోయుచున్నది.

భగవానుడు భగవద్గీతలో బైబిలులో ఖొరానులో త్రిపిటకములో దర్శనమీయడట - నిశ్చల నిర్మల నిస్తులాంచలమైన నీ హృదయములో నీ పొరుగువాని హృదయంలో వెదకిన తప్పక సాక్షాత్కరించునట. వెంకట రత్నముగారి పరమసుందర విశ్వాసము ప్రశంసనీయము.

## "విశ్వాసం" అనే కవితలో

" ఓనా ఆత్మా ! సత్యాన్ని ప్రేమించు
మౌనంగా జీవించు.

ఓ నా ఆత్మా ! ఉన్నతమూ, సాధారణమూ అయిన
జీవితాన్ని అన్వేషించు.

అహంకార దాస్యంనుండి విముక్తిని పొందు.
ఓనా ఆత్మా ! సర్వ ప్రపంచ సంక్షేమం
నీజాతి కోసం దేశంకోసం అయిన ప్రేమకు
ఉద్బోధకమగు గాక ! "

ఓ నా ఆత్మా ! ఆ సర్వోత్తమ జ్యోతిని
ఆ పూర్ణ సత్పదార్థాన్ని

ఏ మానవుడూ, ఏ దేవతా చూడ లేదు.
ఆయన్ను కనుక్కోలేక నిరాశతో
విజ్ఞాన శాస్త్రం వేదాంతం కవిత్వం
వెనక్కి తిరిగివస్తవి
అయినా ! ఆయన ఉన్నాడు.
మరి ! జీవితం జీవిస్తున్నది. ఎందుకో తెలుసా !

ఈ విశ్వం ఆయన ప్రేమతో పొంగిపోతున్నదనే
గాఢ విశ్వాసం దానికి ఉన్నది ".

ఈ విశ్వాసం ప్రపంచానికున్నంత కాలము జగత్కళ్యాణానికి కొదువలేదు. ఆయన సర్వోత్తమ జ్యోతి. ఆయన పూరసత్వదార్థము. ఆయనను గురించి తెలుసుకోవాలని విజ్ఞాన శాస్త్రము, వేదాంతము, కవిత్వము కలిసికట్టుగా కృషి చేశాయి. అయినా సాధ్యము గాలేదు. పురోగమన దృష్టితో సాగినంతవరకు సాగి – సాగి – చివరకు శక్తిహీనాలై మరలి స్వస్థానాలకు చేరుకున్నాయి. అనిర్వచనీయమైన ఆ జ్యోతి మహిమలను కనుగొనలేని తమ శక్తి హీనతనే అవి నిందించుకొన్నాయి. కాని ! ఆ జ్యోతి యొక్క అస్థిత్వాన్ని అవి ప్రశ్నించలేదు. ఆజ్యోతి దివ్యకాంతులను లోకము మీద సదా వర్షిస్తున్నది. ఆ సత్వ దార్థము మానవాళి మీద అనంత కారుణ్యాన్ని కురియి స్తున్నది. అందువలననే —

" ఆయన ఉన్నాడు " అని అంటాడు వెంకట రత్నము గారు. భగవద్విశ్వాసముతో బ్రతుకును పండించు కొనుటకు ప్రతివారును ప్రయత్నించి తీరవలెననెడి ప్రబోధ మీ కవితలో ప్రతిధ్వనించుచున్నది.

" సదా ప్రేమమయము, సదా సహాయకము

సర్వ వ్యాపకము, – అయిన ఆత్మను ఏకరీతిగా ధ్యానంలో సాక్షాత్కరింపజేసుకో ! " అర్షధర్మానురక్తితో పరమ విశ్వాసమును భగవంతుని పట్ల కలిగి యుండ వలయునని వెంకటరత్నము గారి విలక్షణ సూచన.

అగుటకిది వచన గేయ కావ్యమే కావచ్చును. కాని: యిందలి ప్రతిపుట యందును భారతీయ తాత్త్విక ధోరణి వ్యక్తమగుట గాంచుదుము. ఛందశ్శాస్త్ర నిబంధనలతో చట్రములనదగిన పద్యములలో ప్రతిపాదితమై విరాజిల్ల వలసిన యెన్నో అంశాలను నిబంధనలకు కట్టు వడని వచన గేయమున గూడ ధారాళముగ వ్యక్తీకరింపవచ్చు నని వెంకటరత్నము గారు ఋజువు జేసినారు.

ఓ నా మనస్సా ! కాంతిని తలచుకో !
నీ జీవిత నిశీథం కూడా
పగలంత కాంతిమంతమవుతుంది

ఓ నా మనస్సా ? దివ్యాత్మ – అంటే !
సంతోషం కాకపోతే – సత్యం కాకపోతే
రసం కాకపోతే – ఇంకేమిటి ?

మనస్సు కాంతి వంకకు పయనించాలి. విశాల విశ్వములో మానవుని ఆరాటము కాంతి తరంగాల సముప లబ్ధి కొరకే. నరుని నిరంతర పోరాటము తిమిర తతుల సర్వ విధ్వంసనార్థమే.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ.

అనుచున్న మహర్షి వాక్య వైభవానికి మారు రూప ముగనే —

“ మనస్సా ! కాంతిని తలచుకో ? ”

అనే వాక్యాన్ని సృజియించారేమో! వెంకటరత్నము గారు.

" భగవానుని పరమాద్భుత లీలా రంగస్థలముగ ప్రపంచమును " ప్రాజ్ఞులభివర్ణించుదురు. మహోదాత్త మైన యీ విశాల భావన కనుగుణముగనే లోకపు గమనము కొనసాగుచుండును.

విశ్వచక్ర పరిభ్రమణము విశ్వేశ్వరుని కనుసన్నలను సరించి జరుగుచుండును. నరుడు నిమిత్త మాత్రుడుగ నీ వ్యవహారమున పాల్గొనును. తానే సర్వకారణ భూతుడనని అహంకరించుట తగదు. నారాయణోపనిషత్తు ప్రవచించు చున్నట్లు నారాయణుడే సర్వమునకు మూలము. పురుషోత్తముడే పురుష కోటి కారాధ్యుడు. పురుషులందు - అందరు ధరా చక్రమును క్రేల దిప్ప జాలరు. పురుషోత్త మాంశ గల యే యొక్కడో పృథ్వీపతి యగును. వానిని నరపతి యందురు. జగత్పతి యతడు గానేరడు. నరనాథుడు లోకనాథుడెట్లు కాగలడు ?

కావుననే నరుని కృషి పరిమితము - అపరిమితో దార వాత్సల్యఖనిగా - పరిపూర్ణ సత్పదార్థముగా విరాజిల్లు పరమేశ్వర విశ్వాసము నరనారీలోక సర్వస్వమునకు ధ్యేయము. కర్మసాక్షి, ప్రత్యక్షదైవము సూర్యభగవా నుడు. సూర్యస్తుతిని వెంకటరత్నముగారిట్లొనర్చు చున్నారు.

ఓ కాంతిపితా! ఇదంతా నీ ప్రసాదము.
మేము ప్రేమతో సాధించేదంతా
మేము ఆశించేదంతా
నిద్రాణమైన మృత్యుద్వారాల గుండా
మేము చేసే ప్రయాణాలవల్ల కాబోయేదంతా
మరణిస్తున్న తమస్తరంగాల మీదుగా
నీ రహస్య నావలో నీవు తేలిపోతున్నపుడు
విపిన విహంగాలు పాడే పాటంతా
పుట్టడానికి పూర్వంగల ఆవలనుండి
వచ్చినవారి రాకతో
మొట్టమొదట వారి తల్లుల నయనాలు పొందే
సమ్మోదానికి
పసిబిడ్డలు దేనికొరకు ఏడుస్తారో! అదంతా
నీ ప్రసాదం —

సూర్య భగవానుని దివ్యానుగ్రహవిశేషము వలననే జగత్తు కళకళలాడుతున్నది. ఆయన కరుణ కొరవడిన తరి — ధరణి గాఢాంధకార బంధురమే కాగలదు. ప్రత్యక్ష దైవముగ భాసించెడి భాస్కర మూర్తికి చేతులెత్తి మ్రొక్కెడి తీరిక లేని వారి నేమనవలెను? వారి కొరకే యీ ప్రబోధము. ఈ సందేశము.

పృథివ్యాపస్తేజో వాయ్వాకాశాలమీద
పలు రంగుల కిరణాలు క్రుమ్మరిస్తున్నావు

అయినా ఓ సూర్యుడా!
నేను నిన్ను ప్రార్థించే దేమంటే!
నీ బంగారు తలుపులు తెఱు
నీ హృదయాన్ని చుట్టిన
కాంతి సింహాసనం చెంతకు నన్ను చేర్చు.

నరుని నిత్య ప్రార్థన యిది గావాలి.

జగచ్చక్షువైన ప్రభాకరస్వామి క్షణకాలము కాంతి పుంజ ప్రసారము నాపదలచునా! అసంభవము. దయా మూర్తి; లోకబంధు; సూర్యనారాయణుడు; బంగారు తలుపులు తెఱచి కాంతి సింహాసనము చెంతకు మానవాళిని చేర్చుకొననిచో నరుడు జ్ఞాననేత్ర విలసితుడు కాగలడా? ఆ లోకబాంధవుని కన్న మిన్నగ నరులను ప్రేమించి - వారి అభ్యున్నతిని గాంక్షించు వారెవరుందురు?

కరుణ కవితకు ఊపిరి. కవిత కరుణకు ప్రాణము. కరుణ కవితగా మారినా; కవితలో కరుణ వెల్లువ గట్టినా కళ్యాణమే. సానుభూతి నుండి కరుణ పెల్లుబికితే - కరుణ నుండి కవిత గంగగా ప్రవహిస్తుంది. సానుభూతి చూపని యెడదను సహృదయులయిన సాధుమూర్తులు సహారా ఎడారితో పోల్చారు.

"కారుణ్యజ్యోతి"లో వెంకటరత్నము గారి హృదయ మీ సత్యమునే ప్రతిధ్వనించుచున్నది.

రాజ్యాలను సామ్రాజ్యాలను
నాశనం చేసే శక్తులు
సానుభూతి భ్రష్టం కావడం వలన
పుట్టుకొస్తవి.
అంతరాత్మ యొక్క గానంవల్ల
ఉన్నతిని అందుకో లేని మానవుడు
దివ్య ప్రేమ బంధంలో
సర్వాన్ని ఆలింగనము చేసుకొనడానికి
పుట్టినవానివలె వర్తించడు.

ఓ మానవుడా ! నీ జాతిలో పుట్టిన సోదరులమీద, అక్క చెల్లెళ్ళమీద, నీ కొడుకులమీద, కూతుళ్ళమీద దయగలిగి ఉండు.

ఇతర జాతుల సోదరులమీద
పుత్రులమీద పుత్రికలమీద దయ వహించు.

నీ తమోమయ హృదయ గవాక్షాలను తెరు. దయా వాయు కాంతులను లోనికి ప్రవేశించనియ్ ! గుండెలలో కరుణ నిండుగనుండవలెనని సర్వ మానవులు కరుణామూర్తులు కావలెనని వెంకటరత్నము గారి అంతరాంతరాళాల ఘోష.

ప్రతి ప్రాణి కోరుకొనేది శాంతి. శాంతి కొరకై ఆరాట పడడం జగత్తుయొక్క సత్య లక్షణము. శాంతిమయ జీవిత పథంలో సతతము సాగిపోవాలని వాంఛించే బహు దూరపు బాటసారి మానవుడు. సుదూర తీరాలకు చేరు

కొనుటకు నరుడు సాగించెడి అనంతయాత్రలో అశాంతి దేవత సాక్షాత్కారము జరుగరాదని అభిలషించుట మామూలు విషయమే. మనుగడ సంఘర్షణల నిలయము. కనుక మానవుడు నిరంతరం తృప్తితో మాత్రమే అడుగు ముందుకు వేయుట సర్వసామాన్యము. శరశ్చంద్ర చంద్రికలలో తడిసి మల్లెల మొల్లల జల్లుల మధ్య తీపి గుర్తులుగా—జీవిత యాత్రలో; నరునికి కొలదిగ మాత్రమే మిగులుతాయి. అవి నిత్యశాంతి సాధన కొరకు మానవుణ్ణి సమాయత్తుణ్ణి చేస్తాయి. శాంతిని గోరి మానవాళి పడే తపన "శాంతి" అను గీతమున వెంకటరత్నముగారెంతో ప్రతిభావంతముగ చిత్రించారు.

నక్షత్ర శిశువుల స్వాప్నిక నేత్రాలలో
నివశించే ఓ శాంతీ! రావమ్మా! రా!
వచ్చి నా హృదయాన్ని నీ నివాసముగా చేసుకో
ఒక దివ్యప్రాణి
ఇంత సుదూరాలైన ఆకాశపథాలు దాటి
ఎడారిలో ఒంటరిగా బ్రతికే
ఒక జీవికకోసం రావడం
గౌరవప్రదం కాదనుకొంటున్నావా!
దివ్యమైన ఉదాత్తమైన ఆశ్చర్యకరమైన

కార్యాలకు జీవితాన్ని పురికొల్పే
దివ్యస్వర సంగీతాన్ని నేర్పు నాకు
నక్షత్ర శిశువుల స్వాప్నిక నేత్రాలలో
నివసించే ఓ శాంతీ! రావమ్మా! రా!

ఆర్ద్ర హృదయముతో గావించే యీ అభ్యర్థన - శాంతిదేవతకు వినిపించాలని, ఆమె యీ విన్నపాన్ని మన్నించాలని వెంకటరత్నము గారి ఆశ, ఆశయము. అది సత్యమే.

ఈ వచన గేయాలను పలు సభలలో వెంకటరత్నము గారే - ఉదాత్త స్వర మాధుర్యము చిందునట్లు చదివి వినిపించునపుడు వినినవారు ధన్యులు.

నొక్కవలసినచోట పదాన్ని ఊది పలుకుచు భావ యుక్తముగ కంఠ స్వర స్థాయీ భేదములను మార్చుచు కవియే తాను వ్రాసిన గేయకృతిని పఠించునపుడు రచనలో నొక క్రొత్తదనము వెల్లి విరియును. మోహన స్పందన వైభవవైఖరులు కురియును. ముగ్ధ సౌందర్యరేఖలతో గీతిక మురియును.

"శాంతి తీరాలకు" అనెడి యీ గేయ కృతిలో నూట ఎనిమిది ఖండికలు కలవు. తెలుగు కవితా సరస్వతి చరణముల సన్నిధికి బహుముఖ రస ప్రపుల్లములగు కుసుమము లేరి తెచ్చి వెంకటరత్నము గారొనర్చిన

అపూర్వ పరిమళ సంభరితమైన అష్టోత్తర శతపుష్ప పూజ యిది. అనన్య సాధారణ విషయ సురభిళమైన అష్టోత్తర శత భావ సుమార్చన యిది.

శ్రీ వెంకటరత్నము గారికి ఆంధ్రాంగ్ల భాషల యందు వలె సంస్కృతమునందు గూడ చక్కని పాండిత్యము కలదు. వారు సుప్రసిద్ధులయిన గురువుల వద్ద విద్యనేర్చునాడే తన సంస్కృతభాషా విజ్ఞానమునకు పదును పెట్టుకొనివారు. కావుననే వారా బలముతో కొన్ని సంస్కృత కావ్యములను గూడ వ్రాయుట జరిగినది. వారు రచించిన ఇందిరా విజయము, చంద్రశాల మొదలయిన కావ్యములను సంస్కృత భాషయందు చక్కగ అనువదించియున్నారు. ఈ గ్రంథములు విబుధకోటి మన్ననలకు పాత్రములై ప్రకాశించినవి.



# వత్సలుడు

రారాజుల్ బహుభోగభాగ్యముల నారాధించిబాహ్యంగలే
ఖారమ్యంబుగ సంచరింతురిక కాంక్షాధూమందాత్మ లే
యే రాపిళ్ళకు చీకిచిక్కెడివా! వెల్గే కానరాదింత బృం
దా రాజ్యంబున గొల్ల బోయడ! వసంత జ్యోత్స్న పిండింతువే!

శ్రీకృష్ణ పరమాత్మ యందలి వినిర్మల భక్తి భావనను ఛందో రూపమున వెలయించిన తీరిది. రమ్యతమమైన యూహ వెల్గే కానరాదని ఘోషించుచున్న మానవాత్మ వసంతజ్యోత్స్నను పండింప వలసినదిగా పరమాత్ముని ప్రార్థించుచున్న యీ విధానము మధుర భక్తి సుధారస స్రవంతుల కేతాము గట్టుచున్నది.

వెంకటరత్నము గారి 'వత్సలుడు' కావ్యమునందిట్టి రసవంతములైన పద్యములు కొల్లలు కొల్లలుగ కనిపించును. వత్సలుడు కావ్య రచనలో ఇతివృత్తము విలక్షణతను సంతరించుకొనుట విశేషము. సాహితీ మేఖల పక్షముననే యీ కావ్యమును కవిగారి మిత్రులు శ్రీ మంత్రి వెంకటేశ్వర రావుగారు కోరకయే ముద్రించారు. రసజ్ఞ పాఠకలోక

హృదయముల నచిర కాలముననకే ఆకట్టుకొనగల్గిన యీ మధుర కృతిని వారే అయాచితముగ పునర్ముద్రణ గావించుటకు గూడ పూనుకొనుట - సంస్తవనీయాంశము. కావ్యప్రతిభాప్రాచుర్య ప్రాభవమునకు ప్రబల సాక్ష్యము.

పెండ్లి పిల్లను వరుని చే బెట్టువేళ
వెన్న బోలిన హృదయాన కన్నతల్లి
కరగి కార్చెడు కన్నీటి కాల్వలందు
వేడి యుంట నెరుంగవో ! వెఱ్ఱి దాన !

కన్నతల్లి కన్నీటి ధారలలో గల వెచ్చదనానికి కవి చెప్పిన క్రొత్త యర్థము గుండెలను గదలించుట లేదా !

పూలరాణి గులాబికై కేలుచాచి
ముల్లునోకెనటంచు వాపోవదగునె ?
మలయ చందన తరువును మలుచుకొనిన
కాల సర్పంపు హృదయమే కవి గణించు ?

భయంకర సృష్టినుండి ప్రసన్న భావ వాహిని పరుగులెత్తుచున్నది. ఇట్టి సందర్భములలో గల అంత రార్థములకు భాష్యము నిట్టి కవులే చెప్పవలయును. అని సర్వార్పణ మొనర్చి శ్రీకృష్ణుని శరణు గోరుచున్నాడు.

మధుర మనోహరమైన కథా పద్ధతి యొక వంక ముందునకు సాగుచుంఢ నడుమ నడుమ నిట్టి తాత్త్విక

భావనల పూలదోసిళ్ళను విరజిమ్ముకొనుచు వెంకటరత్నము గారి కవిత పురోగమించినది. జీవునకు జీవేశ్వరునకు గల చుట్టరికమును పరమాత్మ కాత్మతో గల సన్నిహిత సంబంధమును శ్రీకృష్ణ మధురభక్తిని నిరూఢములగు నిదర్శనములతో కావ్య రంగమున ప్రదర్శించి సఫలీకృత మనోరథుడైన కవి సర్వ విధముల నదృష్టవంతుడే గదా !

ఇట్టి మధుర భావ సంఘర్షణాత్మకమైన కావ్య మగుట వలననో ! ఏమో ! యీ కావ్యము 'సారస్వత విశారద'కు పాఠ్య గ్రంథముగా నిర్ణయింపబడి బుధజనుల యామోద ప్రమోదములకు బాత్రమైనది.

పుడమి యిల్లాలి నీటి కొంగొడిసి లాగు
తరణి దుండగమును శాంతిపరుప జూచు
జగతిపై కోరచూపుల సెగలు రువ్వి
మండిపడుచుండె నతడెదురుండ డెవడు.

ఉత్తమ స్థాయిలో నడిచిన రూపకాలంకార చిత్రణ దృశ్యమును నయన గోచర మొనర్చుచున్నది.

జగదధిష్ఠానమై యొక సత్పదార్థ
ముండనే యున్న సమభావ ముండ దెట్లు
తనదు సామ్రాజ్యమందున్కి గనిన జీవి
బిడ్డయే కద ! తండ్రి విద్వేషి యగునే ?

భాషలు మూగవై తలలు వాల్చ తదీయ సమగ్ర శక్తి ని
శ్శేషముగా వచింపదగు శీలము లేమియటందు రెందులే
శోషల ద్రోసి జీవులను చూర్ణము గాగ దపింపజేయు దు
ర్భీషణ కృత్యముల్ జగతి వేపక సౌఖ్యములీయజాలదే!

ఇట్టి చక్కని యూహ లెన్నియో యీ కావ్యమున గలవు.

ఏడ్చునది దేహ; మాత్మ కే యేడ్పు లేద
టంచు బల్కిన - సర్వగతాత్మ దేహ
మందు లేకుండెనే! దేహమాత్మ యేమొ!
ఏడ్చు నెడ దేహమాత్మయు నేడ్చినట్లె!

ఇట్లాత్మ విచారణ గావించిన వెంకటరత్నము గారు—

తలపు కెక్కినవా డధిదైవమనుచు
అతనికై నట్టి తను విధి హవ్యమనుచు
జరుప బడినట్టి ప్రేమ యజ్ఞమున కిపుడు
సలుపు పూర్ణాహుతికి నీవె సాక్షి కృష్ణ!

అంటారు.



# ప్రభుసప్తతి

భక్తి తత్వమునకే హృదయము నంకిత మొనర్చిన వారు నిత్యము తెల్లవారుజామున భగవన్నామ స్మరణ మొనర్చుట మనకు పూర్వానుభవమే. మధురగళమ్మే త్తి కొందరుషఃకాలమున దేవదేవుని పలు తెఱగుల గీర్తించు ఛుండ పారవశ్యమున పరిసరములన్నియు భావాతీత మహ దానందము ననుభవించుటయు పరిపాటియే.

ఇందు కనుగుణములయిన ధ్యానశ్లోకములు, స్తుతి పద్యములు; స్తోత్రవచనములు; సంకీర్తనలు మున్న ఆర్ష వాఙ్మయమునందెన్నియో యున్నవి.

లౌకిక వైదిక విషయములను కవితామయ మొనర్చుటతో బాటుగ మన సాహిత్య స్రష్టలు ప్రభాత సమయమున భగవన్నామస్మరణ మొనర్చుట కుపకరిం చెడి ముగ్ధ మనోహర వేదాంత భావములకు సైతము సార స్వత స్వరూపమును సమకూర్చి జీవితమునందేగాక కవితా జీవితమున గూడ చరితార్థులైనారు. సఫలసంకల్పులైనారు.

వెంకటరత్నము గారి "ప్రభుసప్తతి" ఆ కోవకు జెందిన స్తోత్ర కావ్యము.

"నాకిష్టుడు శ్రీకృష్ణుడు. కృష్ణకథ గద్యమున వ్రాసియుంటినికాని స్మరణమున పద్యమే శ్రేష్ఠము"

ప్రభుసప్తతిని పాఠకలోకమున కందజేయుచు కవి పలికిన పలుకులివి.

"వారప్పుడు 'ప్రభుసప్తతి'ని వినిపించిరి. తిరిగి పద్యోన్ముఖమైన వారి వాణిలో నొక ఆధ్యాత్మికానుభూతి నన్ను తన్మయు నొనర్చినది. అది ఒక కావ్యముగ, ఒక ఉపనిషత్తుగ ఒక దర్శనముగ నాకు సాక్షాత్కరించినది.

ప్రముఖ సారస్వత వేత్త శ్రీ పులిజాల హనుమంత రావుగారు ప్రభుసప్తతిని పరిచయము జేయుచు పలికిన పలుకులివి.

వారిరువురి గుండెలను పిండి వడకట్టిన సారమా యనునట్టున్నది వారి వివరణ.

ఎవరైనను ప్రభువును గూర్చి వ్రాయ బూనినచో యిష్ట దైవము నామముతో కవిత పొంగులు వారి తీరును.

సత్య దృష్టితో సమీక్ష సల్పునపుడా కావ్యమే తీరున వ్రాయబడినదైనను కావ్యముగనో : ఉపనిషత్తుగనో : దర్శనముగనో : దర్శనమిచ్చుట సర్వసాధారణమే.

నిను సర్వాత్మునిగా దలంతు దలపన్నేరన్ మరేదేవునై
నను-నీ కీర్తనగాని దాని విన సన్నద్ధుండ నే గాను, జూ
డను శంకింతు త్వదన్య రూపమును జూడన్-దేవకీగర్భ శు
క్తిని వెల్వడ్డ - అమూల్య మౌక్తికమ ! రుక్మిణ్యాత్మ !
కృష్ణ ప్రభో !

ఓహో ! ఎట్టి అచంచల కృష్ణ భక్తి ?

రామ భద్రునే నమ్మి కవిత వ్రాసి భాగవతమును రామదేవునకే అంకిత మొనర్చిన పోతరాజు-దాశరధీ శతక కవితా రూపక సువర్ణ పతకమును వాణీగళమున మేలి తార హారముగ వైచి ధన్యుడైన గోపన్న, వేలాది పదములతో శ్రీ వెంకటేశ్వరు నర్చించి జన్మ చరితార్ధతం గన్న అన్నమయ్య, " రామ ! నీ సమాన మెవరురా ! " అని పాడుచు కృతి సహస్ర ప్రసూనాల పరిమళాలఘుమా యింపుతో జానకీ మనోనాధుని పూజించి మనోరధము లను పండించుకొనగల్గిన త్యాగరాజు వంటి మహనీయుల భక్తి రసాత్మక ప్రఫుల్ల కవితా వ్యవసాయ మొక్కమారు మన భావాంబరమున మెదలుచున్నది. ఏకాగ్రతకు ప్రగాఢ భక్తికి చిహ్న మనదగిన కవిత గదా ! వెంకట రత్నము గారి భావ ధోరణి. ప్రభుస్తుతి యందము లన్నియు తాదృశ వేదాంత భావ రత్న కాంతులతో భక్త జనుల కనుల జిగేలు మనిపించుచున్నవి.

"కృష్ణప్రభూ !" తన యిష్ట దైవమును మనసార తమిదీర నోరూర సంబోధించుకొనుటకొరకేర్పరచుకొనిన యీ పద మెట్టి సుకుమారమైనది ? సుందరమైనది ?

"భాగవతమున త్రిజగన్మోహన నీల కాంతి తను వృద్ధిపింప ప్రాభాత నీరజ బంధు ప్రభమైన చేలము వయిన్ రంజిల్ల – నీలాలక వ్రజ సందోహము ఖారవింద మతి సేవ్యంబై ప్రభాసింప–మా విజయుం జేరెడి వన్నెలాడు."

అని కృష్ణుని లావణ్యతారుణ్యశ్రీని అద్వితీయ బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన భీష్మాచార్యుల వారు భావించారు.

"కృష్ణప్రభూ !" అని ఆ దేవకీ తనయునే హృదయ మందిరమున కాహ్వానించి కవితా మరంద రస ప్లావిత, భవ్య భక్తి భావ గంధ బంధుర కుసుమ సంతతులతో పూజించుకొనినారు వెంకటరత్నముగారు.

"కృష్ణ" ఆకర్షణను తెల్పును. సకల గోగోప గోపీ హృదయాకర్షకమే గాక నిఖిల యోగి జన – అఖిల దేవతా గణ – హృదయాకర్షక మైనట్టిది కృష్ణపదము. ప్రభు పదమును కృష్ణపదముతో ననుసంధానించిన కవి చాతుర్యము ప్రశంసనీయము.

ప్రభువనగా సర్వాధికారి, సకలజగత్పతి, సర్వేశ్వరేశ్వరుడు, స్వామి. ఆకర్షణయు నధికారశక్తియుగల

నందనందనుని బ్రహ్మానందమున మనోమందిరమున నర్చింప నాహ్వానించుచు కవి సలిపిన జతనమే రతనమైనది. ప్రభు సప్తతి యైనది. భగవన్నామ సంకీర్తనానుకూల కావ్యమైనది. పరమేశ్వరతత్త్వ చికిత్సాపూర్ణ మధురోపనిషత్తయినది. రుక్మిణ్యాత్మగ వెలుగు లీను వేణుగాన లోలుని-గీతాచార్యుని-కనులముందు సాక్షాత్కరింపజేయు సాహిత్య దర్శనమయినది, మరేదో! అయినది. మాన్యమైనది. ధన్యమైనది. ఇంకేమైన కాగలదు? ఏల కాదు? విషయ మట్టిది. ప్రవక్తయట్టి వ్యక్తి! ప్రబోధాంశము-భాగవత గగన వీధీ విహార నిరంతర మగ్న మానసుడైన వ్రజకిశోరునకు సంబంధించినట్టిది.

కావుననే ప్రభుసప్తతి తేనెసోనల బొరలించినది. పూల జల్లుల గురియించినది. వెండి వెన్నెలల గురియించినది. వేదాంతనవనీత మధురిమల నొలికించినది. పరమపావన భక్తిభావ సుధారసధారల జిలికించినది.

"మునుపేనాడొ! రణమ్ములో విజయుసమ్మోహమ్ము
బోకార్చవా
నిని విజ్ఞానిగ జేయునప్పుడు భవన్నిర్గతమ్ము గీతావచః
ఖని-ఎక్కాలము వేద సంగ్రహ మహా కావ్యమ్ముగా
నిల్చె-దా
నిని జేపట్టి నినున్ స్మరింప నొదవున్ నిర్వృతి కృష్ణప్రభూ!"

గీతాపఠనమును నిత్యమొనరించు డనుటకు వెంకటరత్నము గారు చూపిన హేతు వెంత ముచ్చటగ నున్నది? నిర్భీతి యొదవుట కాధారమదియట.

"పడగల్ విప్పిన సర్పముల్; చెవులు నిల్వంబెట్టు
గో బృందముల్;
మెడలన్ బై కెగనెత్తు నెమ్మిలు; భ్రమోన్మేషమ్ముతో
నిక్కిచూ
చెడు లేళ్ళున్; వినెనెంత సేపటుల వంశీగీతి జిత్రోల్లస
జ్జడరూపమ్ములతో-సమాధిగత విజ్ఞశ్రీలు కృష్ణప్రభూ !"

సర్పములు, గోబృందములు, నెమ్మిలు, లేళ్ళ శ్రీకృష్ణ వంశీరవ మాధుర్యమును గ్రోలి యెంత కాలము పారవశ్యముననుభవించినవో తలంచుకొని కృష్ణభక్తు లెల్ల రసూయ జెందు స్థాయిలోనున్నదీ భావన.

తన సంకల్పము తీరనప్పుడొక క్రోధమ్ముద్భవిల్లున్ జగ
మ్మును మ్రింగన్-వశమైనచో నమిలి మ్రింగున్ దాని
పాదాహుతిన్
తనువున్ బారునవెన్నియో మనసు కానంబోదు హింసా
మయం
బని శంకింపదు చండ రూపమున నాట్యమ్మాడు కృష్ణ
ప్రభూ !

క్రోధమెంత దారుణమైనదో ! అది యెట్టి అజ్ఞతను మానవునిలో నెలకొల్పునో ! తెల్పుచు క్రోధభావనల

కతీతునిగా తనను తీర్చి దిద్ది తండ్రివలె కాపాడుమని కృష్ణ ప్రభువునకు విజ్ఞప్తి సేయుటయా ! ఇది ? కావచ్చును. నిజముగ నుపనిషత్సూక్తి వలెనున్న - ఈ పద్యమును తిలకింపుడు.

మనసే కామిని, బుద్ధి మాత, పరమాత్మజ్యోతియే తండ్రి; జీ
వునకంతర్గ్విాతిలో గృహస్థ జన కల్పుండౌచు దత్తద్ధితో
క్తిని విన్నన్ సుఖియౌను ! లేని యెడలన్ ఖేదించి
ఖేదింప జే
యును భావానుగుణమ్ము లభ్యమగు శాంత్యుద్దీపి
కృష్ణప్రభూ !

నిను భావించు విధానమున్ గనక కన్నీరోడ్చి యవ్యక్త రీ
తిని నేమేమొ గణించి చిక్కక మహార్తిన్ గుందనేలా? రణో
ర్విని గాండీవికి బోధజేసిన గురుశ్రేష్ఠుండవై విశ్వ మూ
ర్తిని జూపించిన నిన్ను లోనిలిపి తృప్తింగొందు కృష్ణప్రభో.

అవును వాస్తవములే అన్నియును. లోనిలుపుట కుదరకయే గదా ! లోక మిట్లగుట. అట్టి లోదృష్టి నలవరచుకొనినాడు; దానితో దైవమును దిలకింపగలుగు టెంత పని?

కడలిం జూచినవేళ వెన్నెలలు వేడ్కంజూచువేళన్ ఘనం
బుడు వీధిన్ గనుపట్టువేళ దిననాదోద్దామ తేజంబు తో
చెడి వేళన్-భవదీయ మంశమెయటన్ సిద్ధమ్ము బీజమ్ముగా
బొడమెన్గాని మఱొండు లేదనుచు సమ్మోదింతు
గృష్ణప్రభూ !

సముద్ర గాంభీర్యము - వెన్నెల సొగసు-మబ్బుల నిండు దనము - సూర్యభగవానుని దివ్య తేజము పరమాత్ముని అంశలగుట వలననే అట్లున్నవి.

సర్వవ్యాప్తి పరమాత్మ. విష్ణు శబ్దము తెలియ జేయున దేమి ?

“ సహస్ర సశీర్షా పుషః సహస్రాక్షః
సహస్ర పాత్ సభూమిం విశ్వతోవృ
త్వా ఽ త్యతిష్టద్ద శాంగులమ్ పురుష
ఏవేదగ్ం సర్వం-యద్భూతంయచ్ఛభవ్యం ”

“ విశ్వం నారాయణం దేవ మక్షరం పదమ్
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం
విశ్వమే వేదం పురుషస్తద్విశ్వముప జీవతి
పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్ !

అని వేదవాణి చెప్పుచున్నది. విశ్వమంతయు స్వామి సౌందర్యము స్వరూప వైభవమునకు ప్రతీకయే. ఈ పరమ సత్యాన్ని యోగులు సులభముగ గుర్తించగలరు. యోగ దృష్టిగల ఋషితుల్యుడైన కవిభావన కిది కొంతగ నందవచ్చును. కావ్యవీధులలో పై సత్యము నుద్ఘోషించుట కొరకు సాగించెడి ప్రయత్నమే కవి విలువలను విజ్ఞతలను విశదీకరించును.

తనువుందాల్చినవాడు నేననుచు నాత్మంగూర్చిపల్కన్
గనుం
గొన నయ్యాత్మ యెదో? అటంచు నది కన్నుంగాదు
కేల్గాదు నా
తను వన్నప్పుడు దానికిన్ మిగిలి యాత్మ ద్రవ్యమే
దోయగున్
కని రూఢింగొనువాడు జ్ఞానియని విఖ్యాతుండు
కృష్ణప్రభూ!

జ్ఞానచర్చ ఉత్తమజ్ఞాన సిద్ధికి మార్గ నిర్ణయము. వేదాంత భావలహరి యిట్టి కృతిలో పొంగులు వారినది.

ఒగరుల్ రేగులు పండి తీపి గొనగా నొప్పున్ భుజింపగ జే
దుగ నున్నట్టివి; కాకరల్ తఱిగియందున్ గారముంబెట్టి వం
డగ రుచ్యమ్మగు కూరగాదనరుచుండన్ జూడమేనేడు - చె
డ్డగ సిద్ధించిన కర్మ పక్వమయి పండన్ వచ్చు
గృష్ణప్రభూ!

పాపకర్మలు సత్కార్యములతో సముచిత వర్తనతో బండి - పుణ్యానుభూతిని గలుగజేయుట నిస్సంశయము. కవిగారిచట నీ విషయము నిరూపింప గైకొనిన లౌకికో దాహరణమద్భుతముగనున్నది.

చేయన్ స్నానము-వార్చ సంధ్య-దగ నర్చింపంగ
దేవాదులన్
పోయన్ నీళ్ళు తిలల్ పితాళ్ళకు జనన్ బుణ్యస్థలుల్
జూడగా
నా యుల్లంబు సముల్లసింపదు భవన్నామస్మృతిన్
జేయవా
లాయింతున్ ననునేనె-చాలదియె చెల్లన్ జన్మ
కృష్ణప్రభూ !

అనుష్ఠానకాండ పెంచలేకపోయిన నేమి ? ఆత్మ శుద్ధియు నామస్మరణానురక్తియు నున్న దైవానుగ్రహము సులభమనుచున్నాడు.

" కలౌతు స్మరణాన్ముక్తి. "
" నామ స్మరణాద న్యోపాయం నహిపశ్యామోభవతరణే. "

అనెడి సూక్తులకు గల పరమార్థ ప్రశస్తిని ఈ పద్యమున కవిగారు కడుంగడు రమ్యముగ విశదీకరించినారు.

" శ్రీమన్మోహనమైన శాంతిపద సంప్రీతిన్ భవత్సేవలో
కామమ్మో! మరి ప్రేమమో! జడతయో! కైవల్య
సంసిద్ధియో
యేమో ? దాని విచారమే కనక మోహీభూత చిన్మగ్నులై
యేమాసించిరి నాటి జీవులదినేనిచ్ఛింతు గృష్ణప్రభూ !

ఓహో! ఎట్టి మహోదాత్త భావన?

నాటి జీవులేమి యాసించి సేవించిరో! అది కావలె నట ఇచట - ఇచట నేమిటి? కావ్యము నందంతట - పదములెట్లు ప్రతిభావంతములై పరలినవో! భావములట్లు మహోన్నతములై దొరలినవి. సన్నివేశ సౌందర్య విశేషములిట్లు అహమహమికతో పొరలినవి.

"ప్రభుసత్తి"ని కావ్యమనుకొందమా! అభ్యంతరమేమి? శతకమనుకొనవచ్చునా! మకుటము కలదు. కావున ననుటకు వీలు కొంతవరకు గలదు.

శతకము మాత్రము పూర్తికాలేదు. ముక్తక గ్రంథముననిచో! అసౌకర్యమేమియునుండదు. ప్రతి పద్యము ప్రత్యేక భావ ప్రభావ భాసురమై మనోజ్ఞతను వింగడించుచున్నది. ఏమైన నేమి? ప్రభుసత్తి మధుర భక్తి భావామృత పరిపూర్ణ మంజుల కావ్య కలశము. నూరు పద్యములున్నచో నిరువదవ శతాబ్దమున వచ్చిన శతక రాజములకు తలమానికము కాగలిగెడిదేమో! వెంకట రత్నముగారట్లు చేయలేదు. వారి యోచన యేమో!

"ప్రభుసత్తి" రచన సప్తతి వద్ద సముదాత్త సౌందర్య రేఖగ ఆగినది. ఆగిన కలమును కవి ముందు నకు సాగింపలేదు. మనస్సును వేగిరపరచి బలవంతముగ ముందునకు లాగించుటకు ప్రయత్నించలేదు. ఆగిన చోట

ఆగిన సప్తతి-సన్నని జాజి పూల తీగ సాగినట్లు నిల్చినది. సాగినంతవరకే సాగి సముజ్జ్వల ధోరణిలో ఆగినది. కావుననే పున్నాగపు పూల పుప్పొడివలె భావ పరిమళాల ప్రశస్తి రేగినది. తీయదీయని జున్నుబాల మాధుర్యము మూగినది. " ప్రభుసప్తతి " శ్రీకృష్ణ సారస్వత రసమనోహర బృందావన మురళియై మ్రోగినది. నందనోద్యాన పారిజాత వృక్షశాఖల కల్లువెట్టుకొనిన అందాల పూలతీగెల మీద ఉయ్యాల ఊగినది.

యమునా నదీ తీర సైకతముల మీదుగ వీచెడి మందమారుత కిశోర చైతన్య స్ఫూర్తికి మూర్తిగ సాగిసాగి ప్రభుసప్తతిగా ఆగినది. భక్తుల హృదయ రంగముల సుప్తముగ నున్న తాత్త్విక చింతనను కవిత యనెడి గాలముతో బయటికి లాగినది. ఒక కావ్యమై ఒక దర్శనమై ఒక ఉపనిషత్తై ముద్దుగ సారస్వత స్రవంతియై సాగుచున్నది.



# కైమోదకి

కవితా శిల్పమున ప్రవేశము లభ్యపడవలయునే కాని - చిత్రములయిన పలురూపముల నేర్పరచుట కవికి సులభముగనే అలవడును. అట్టిది కవితా హృదయుని శేముషి. భావన కుపక్రమించిన పిమ్మట కవికి గమనార్హము గాని పథము, దుర్లభమగు లక్ష్యమును గనిపించవు.

వెంకటరత్నముగారు మేధశ్శక్తి సంపన్నుడైన కవి వరేణ్యుడు. శలాకవలె చురుకైన పదునైన వారి భావన యేఅంశమునందుగాని పాదరసము మాడ్కిపరుగులు దీయును. కావుననే వారు తత్కాలమున సాహిత్య రంగమున దలయెత్తి విలువలను సంతరించుకొని కళకళలాడుచు వర్ధిల్లుచున్న సకల ప్రక్రియలందును ప్రవేశాభినివేశములను గడించారు.

వారు చేపట్టిన ప్రతి సాహిత్య ప్రక్రియయు రసోదంచితమై లలిత మనోహరాకృతిని దాల్చి పాఠకుల నుయ్యాల లూగించుచునే వచ్చినది.

ఏ అంశము నే ప్రక్రియ యందు ప్రక్షిప్తమొనర్చి ప్రకటింపదగునో : వారు నిర్ణయించుకొని రచన కుపక్ర

మించెడి వారేమో ! నిజముగ వారిట్టి సందర్భముల జూపెడి గడుసుతనము గణనీయము.

ఇరువదవ శతాబ్దమున బాగుగ ప్రచారమునకు వచ్చిన సారస్వత ప్రక్రియ ఏకాంక నాటికా రచన. ఒకే ఒక అంకము నందు రెండు మూడు దృశ్యముల మధ్య దీనిలో కథయంతయు నల్లిబిల్లిగ నల్లుకొని యుండును. సంభాషణ లలో గల స్వారస్యము కథను పట్టుగ నడిపించును.

నటుల ప్రతిభతో కథాంశమునకు సజీవత్వము సిద్ధించును. కొసన సముచిత సందేశము పాఠకుని ప్రబోధించును. ప్రదర్శనానుకూలముగ సాగవలసిన యీ రచన పరిమిత సమయమున ముగింపునకు వచ్చినగాని రక్తియుండదు. తాదృశ నియమనిబంధనము లున్నప్పటికిని ఏకాంకిక నాటికారచనను పలువురు కవులు అభిమానించి ఆదరించినారు. సాంఘిక ప్రయోజనమునో దేశాభ్యుదయమునో, సామాజిక ధర్మముల పట్ల చూపవలసిన భక్తినో ! ఉద్దిష్టముగ నిడుకొని సాగింపబడిన ఏకాంక నాటికా రచన ప్రేక్షకులకు శ్రోతలకు గూడ సమానమైన అనుభూత్యావేశములను గలిగించుచు వచ్చుట ముదావహము. మొత్తము మీద ఈ యుగ సాహిత్యమునందీ ప్రక్రియయొక ప్రత్యేక స్థానమునే గడించెనని చెప్పవలసియున్నది.

వెంకటరత్నముగారి " కౌమోదకి " అనెడి ఏకాంక నాటికల సంపుటి యీ సందర్భమున చెప్పదగి యున్నది.

కవిగారు చెప్పుకొనినట్లుగనే అప్పుడప్పుడు వ్రాయబడిన యీ నాటికలు ప్రజామిత్ర గోలకొండ సుజాత శోభ వంటి పత్రికలలో ప్రచురింపబడినట్టివి. కొన్ని ఆంగ్లము నుండి పరివర్తితములు మరికొన్ని ఉపనిషత్కథల నుండి గృహితములు కాగా వేరొక కొన్ని స్వకపోల కల్పితములు గూడ నిండున్నవి. జార్జి బెర్నార్డ్ షా, హెచ్. జి. వెల్సు వంటి ప్రముఖుల నాటికల నవలీలగ తెలుగు జేసిన వెంకటరత్నముగారు విలాసముగ ఉపనిషత్కథలకు గూడ తెలుగున రూపకల్పన జేసి యున్నారు. మహాకవి ప్రతిభ కది మచ్చుతునకయే కాగలదు.

వీనిని వెంకటరత్నముగారు రంగస్థలమున ప్రదర్శింప జేసిరో! లేదో! తెలియదు. కాని! సంభాషణల యందొక విధమైన సమాకర్షణ శక్తియున్నది. జవమున్నది. జీవమున్నది.

"మేని ముసుగు" అనెడి నాటికలో ఒక పాత్ర మరొక పాత్రతో జరిపిన ఈ సంభాషణ వినదగినట్టిది.

"అదేభూమి-ఇంత స్వల్పమైనదా! ఇంత మారుమూలదా! అని అనుకుంటావు. కాని! అక్కడ నీకు లభ్యమవుతుంది, ఏ కొఱతాలేని అద్భుతమైన సౌందర్యం-దుర్భరమైన దుఃఖం కూడా!"

అద్భుతమైన సౌందర్యానికే- దుర్భరమైన మూల రచయిత భావన సుస్పష్టముగా సూటిగా తెలుగున ప్రతిధ్వనించింది. ఆత్మల శాశ్వతత్త్వమును చిత్రణ చేయుటకీ నాటికలో ప్రయత్నము చేయబడినది.

మఱొకచోట వేరొక పాత్ర యీ విధముగ మాట్లాడుతుంది.

" విశిష్టతను వదలుకొనడం కోటి జనంలో ఒకరుగా ఉండటం, భాను బింబములో ఒక కిరణానువు మాదిరి "

అనగా ప్రతిప్రాణి తన ప్రత్యేకతను జీవితములో సాధించి నిల్పుకొనవలెనని వివరించుట కాబోలు.

ప్రతివాడూ తన అభివృద్ధికోసం పెనఁగులాడుతూనే ఉంటాడు.

" ఇహ ప్రపంచం ఎట్లా ముందుకు సాగిపోగలుగుతుంది ".

" ఒకవేళ పోగలిగినా; అది మానవశక్తివల్ల మాత్రం కాదు. విధి వల్ల "

జగన్నాథుడే కాలరథాన్ని నడిపించే అసాధారణ శక్తిసమన్వితుడని నిరూపించెడి వాక్యములివి-" నీవిదంతా చెప్పకముందు మానవుడి దగ్గరకు ప్రేమను తీసుకొని పోదామనుకొన్నా "

"భూలోకంలో ప్రేమ సామాన్యత నీకేమీ మంచిని సంపాదించి పెట్టదు".

ఇటువంటి నగ్న సత్య సూక్తులను భూలోకము విషయంలో-నాటికయందలి పాత్రలు మాట్లాడుకుంటాయి. మానవ ప్రవృత్తిని వెల్లడిస్తాయి.

ఇందు సందర్భానుసారముగ పొందుపరచిన గీతికలు ముగ్ధమోహనములు. రసార్ద్రములు.

" పదునుగల ఎడద సారించు రచనము ప్రసా
రించు నిశిత సారింతు నీపేర - సా
గిలు గులాబులు అసాధ్యపుటాకువెడలి సా
ధ్వీరో ! వెల్గు బెంచ సాయమగు .... "

వచన గేయాలు పుంఖానుపుంఖముగ వ్రాసిన వెంకటరత్నముగారి చేయి- ఇట్టి గానానుకూల మధుర గేయ ఖండికలనీ నాటికల సంపుటిలో ఎన్నింటినో అందించుట విశేషము.

చీలి బేరముల సాధ్యము నాకు వంట సా
మగ్రి గిట్టదు. రసాభాస భాషణ మసా
ధ్యము కోమలుడ నసా
మాన్య గీతమును సాధించి నీకీయసాగితిని.

ప్రతిగీతికయు నిట్లే కలకండల తీపిని గమనమునకు దెచ్చుచు నడిచినది.

“ మధురయామిని రసా
వళుల హిమగణము సా
గిన మాధవ ప్రసాధన చంద్రకిరణ సా
రము లామె నుడులు - సా
ర్థక భావములు పిసాళించు ”

సాగిన మాధవ ప్రసాధన చంద్రకిరణ సాధనములు
ఆమె నుడులు —

కథలోని మాట యిది. ఇచ్చట “ఆయన నుడులు” అని మార్చుకొనినచో వెంకటరత్నముగారి పలుకుల కూర్పుపై చక్కని సమీక్ష కాగలదు.

ఉపనిషత్కథకు నాటిక రూపమిచ్చిన సందర్భమున, పాట రూపమున, నడకయు గూడ మార్పును చెందుట గమనార్హమైన అంశము. “ అహోరాత్రాలు ” అనెడి నాటిక —

ఋతము తపమురా
సత్యము తపమురా!
శ్రుతము తపమురా!
శాన్తము తపమురా!
దమము తపమురా!

శమము తపమురా!
దానము తపమురా!
యజ్ఞము తపమురా!
తపముచేతనే
బ్రహ్మము గనరా!

ఇట్టి యోగ భావ సంపుల్లమైన గీతికతో ప్రారంభమగుచున్నది.

ఒంటిగా మనలేక జంటగోరిన ఈ సమస్త జగమ్ము నెత్తుకొన్నాడురా! ఎంత చక్కని యూహ ఎంత మధురాలోచన.

సంసారంబిది స్వప్నమురా!
జగము మిథ్యరా బ్రహ్మమె సత్యమురా!
సాంబ సదాశివ! సోహం శంకర!
శరణం మే తవ చరణ యుగం.

ఇట్టి రచనలు నిజముగ నుపనిషత్తుల హృదయమునకు భాష్యములై అలరారుచున్నవి.

దుర్లభమౌ యీ నరజన్మంబున
సగము నిద్రచే వ్యర్థంబౌ గద
భజగోవిందం భజగోవిందం
గోవిందంభజ మూఢమతే!

ఇట్టి పంక్తులు వేదాంత భావ సౌరభాలను గుబాళించుచు వెంకటరత్నముగారి, హృదయాంతర్గత దివ్య నిర్ణయములకు ప్రతిబింబాలై ప్రకాశించుచున్నవి.

కవులకు వెంకటరత్నముగారిచ్చుచున్న ప్రబోధమా! అనిపించెడి యీ క్రింది పంక్తులెంత రమ్యములో గమనించుడు.

రసమయాలంకార ! రాజత్సుమ శరీర
సుగుణాలవాల సంస్తుతి పాత్రమృదులీల
స్తుతిపాత్ర మృదులీల మోద ప్రదాయినిన్
బుధహృన్నివాసినిన్ కవితాలతాంగి నొ
క్కని దోషమున ద్రోతే !
కవిరాజ ! తగదు హృత్కమల మీక్రుధ నింప.

బాగున్నది. మనోజ్ఞపదచిత్రణ మనోహర భావ లహరి. కవితను గౌరవింపవలసిన తీరు గాబోలు. కవులకు చెప్పవలసిన మాటలు గాబోలు.

ఈ నాటికలో కవిపాత్ర గమనమును తిలకించుచు నిట్లనుచున్నది.

విరసుల చెంగట సరస కవిత్వ
స్మరణము సేయుట శిరమున వ్రాయకు
పరమేష్ఠీ సరస్వతీ !

ఓహో ! అరసికేషు కవిత్వ నివేదనమ్
శిరసి మాలిఖ ! మాలిఖ ! మాలిఖ !

అనెడి సుప్రసిద్ధ శ్లోకమునకు గేయ రూపము గాబోలు రసవత్తర స్వరూపమును సంతరించుకొనినది.

ఈ నాటికల సంపుటి గూడ సాహితీ మేఖల పక్షము ననే వికృతి శివరాత్రి సందర్భమున ప్రచురింపబడినది.

ఆర్ష సంస్కృతికి ధర్మాభిరుచికి వైదిక సంప్రదాయ ధోరణికి అంకితమైయున్న వారు వెంకటరత్నముగారు. వారి హస్తమునుండి వెలువడిన కౌమోదకి లో—అనువాద నాటికల కన్న—ఉపనిషత్కథలకు సంబంధించిన నాటికలే సునిశితములు, సుందరములు. పాఠకులు వాని వంకకు తప్పక మొగ్గగలరు. మహేతిహాస ప్రబోధకములయిన అంశము లిందుండుటొక్కటే మూలకారణ మనరాదు. తదనుగుణముగ నడిచిన భాషయు - పాత్రచిత్రణయు గూడ పాఠకులను బరవశుల గావించునట్లుండుట ప్రధాన కారణ మనవలెను.

పాఠకులను మురియించెడి ప్రతిభావంతమైన కవి కృషి యెచటనున్న నచట అనురాగాదరాభిమాన కుంభ వృష్టి గురియుట జరుగునుగదా; ఇది సాహిత్య పరమ రహస్యము. వాఙ్మయ పరమార్థము. రససిద్ధుడు సుకృతి యునగు వెంకటరత్నముగారు బహుముఖ ప్రజ్ఞావంతులని వక్కాణించుటకీ గ్రంథమొక చక్కని సాక్ష్యము. ○

# కథావళి

ఆంధ్ర సాహిత్య కల్పవృక్షము మీద అందాలు చిందించెడి పారిజాతము కథానికారచన. ఒక మంచి సందేశాత్మకమైన ఇతివృత్తమును సంక్షిప్త పరిధిలో సముచితమైన చత్రము నందిమిడ్చి రచన కొనసాగించు సందర్భమున కథానిక విషయమే ముందుగ చెప్పకొనవలసి యుండును. కథానికారచన ఇరువదవ శతాబ్దపు రెండవ భాగములో వినూతన చైతన్యముతో విశిష్టమైన సొగసును సంతరించుకొన్నది. ఈ విధానాన్ని అనుసరించి యెంద రెందరో రచనలు సాగించారు. తెలుగు వాఙ్మయానికి తగి నంత ఉదాత్తతను సమకూర్చారు. ఉన్న విషయానికి వన్నెలు చిన్నెలు దిద్ది సమున్నత ధోరణిలో హృద్యముగా చెప్పటకుపకరించెడి యీ కథానికా రచనలో గూడ అంబటి పూడి వెంకటరత్నముగారి ఉపజ్ఞ ఎంతో మనోజ్ఞతను విరియించింది. "కథావళి" అనెడి పేరుతో సాహితీ మేఖల పక్షమున ప్రచురింపబడిన కథల సంపుటి మన మనస్సును చమత్కారముగ నిట్టే పట్టి పఠన జేయిస్తుంది.

ఇందలి భాష తీరే వేరు. వెంకటరత్నముగారు పద్య గేయ రచనలలో వినియోగించిన భాష సంపూర్ణమైన

మార్పును పొంది ఔరా! అనిపించును. అతి సర్వసాధారణ గ్రాంధిక భాషయందు మనకు సాక్షాత్కరించును.

"ఒక ప్రత్యేక కాలమునకు గాక వర్గమునకు గాక–ఎల్లప్పుడు ఎల్లరు చదువ దగిన అంశము లిందుండుటచే నేనీ గ్రంథముద్రణకు బూనుకొంటిని".

ఈ గ్రంథము నచ్చొత్తించిన వెంకటరత్నముగారి శిష్యుడు గురువుగారి గ్రంథమునకు ముందుమాట వ్రాయుచు పైవాక్యములు పలికినారు. వారు దహరించిన రీతి యీ కథావళి యందలి కథలన్నియు సర్వకాలముల యందు పఠనార్హములు.

"కాళింగ మర్దన" కథ చమత్కారమైనది. చివరి క్షణమువరకు కవి చెప్పుచున్న కల యిది యని మనము భావింపలేము. తుదకా రహస్యమును వెంకటరత్నముగారే వివరించినపుడు పాఠకుడు విస్తుపోవును. "సానుభూతి" కథ నిజముగ సానుభూతి గ్రుమ్మరించు కథయే. 'విభ్రాంతి' కథలో సువర్చలపాత్ర సువర్ణకాంతులతో మెరియుట మనము గమనించుదుము. ప్రతిక్షణము పాఠకుని విభ్రాంతిలో ముంచుచు ముందుకు సాగిన కథ యిది.

భాషగూడ కొంత ప్రౌఢతను పుంజుకొని–ఒయ్యార్యాల నొలకబోసినది. ఇందున్న వానిలో కొన్ని అనువాద

కథలు. కాని, వానిని గూడ సొంత మూసతో కరగిపోసినట్లు రచయిత చిత్రించడమొక విశేషము. మూల భావనకు ముప్పురాని పగిది కవితాతత్త్వ విశదీకరణ విషయమున చొరవదీసుకొనుట చెప్పుకొనదగిన ముఖ్యవిషయము.

వెంకటరత్నముగారు కథావళిలో - తాదృశమైన సౌలభ్యాన్ని సౌకుమార్యాన్ని వెలయించినారు. మొత్తము మీద "కథావళి" రచనలో వెంకటరత్నముగారు వినియోగదశ యందుంచిన విధానము కడుంగడు రమణీయము ఇందలి "భాగ్యత్రిపుటి" విచిత్రమైన కథ. గొంతెమ్మ కోరికలు పెట్టుకొని కలలుగని తీరలేదని వ్యధచెందు వారికీ కథ చక్కని కనువిప్పు. ఇది భాషాంతరము నుండి పరివర్తన జేయబడిన కథ. అయినా ఎంతో ముచ్చటగా నడిచింది.

మానవ జీవితమే ఆశామయము. ఆశల కతీతముగ జీవించ కలుగుట సర్వసామాన్యునికి సాధ్యముగాని విషయము. ఊహాలోకమున సంచరించుచు-తనకేదో గొప్ప యోగమున్నదని భ్రాంతి బడుచు వ్యవహరించువారు పలువురు లోకమున గనిపించుచుందురు. భాష యేదియైన నేమి? అట్టివారి కందరికి నిందు చక్కని సందేశమందింపబడినది.

"ఏ మానవుడు - ఎక్కడ నిక్షిప్తమవుతున్నాడో! అక్కడే ఆ స్థానంలోనే అతడు చక్కగా పరిశీలించుకొంటే

తన విధి యేమిటో అర్థమవుతుంది. తాను కొంత పని జేయడానికి - అది యేమాత్రమయినా సిద్ధించి తనకు సంతుష్టి లభించడానికి వీలుంటుంది.

కానీ! అట్లాగాక అగాధమయినటువంటి కలలు గనుచు-ప్రపంచమంతా తిరిగి జీవిత కాలము నంతటిని పాడు జేసుకొనిన - ఏమైన లాభమున్నదేమో! ఆలోచించుడు.

అనెడి మాటలతో రచయిత యీకథను సమర్థవంత ముగ పూర్తిచేసి-సూచన ప్రాయముగు సందేశమును మాన వాళి కందజేసినాడు. మొత్తము మీద కథలన్నియు రసగుళికలు. "ప్రేమసత్త" అనునది మరొక కథ. అను కొనుచున్న వానికన్న భిన్నములగు పరిస్థితుల యందిరుకు కొని యున్న పాత్రల మనస్తత్వము మిక్కిలి చక్కగ నిందు చిత్రీకరింపబడినది.

"ఒకరిపైన ఇష్టముండుట అనగానేమియో! ఇంకొ కరిని చూచిన అనిష్టముగ నుండుటేమిటో! ప్రేమ కలగడ మెట్లో! ద్వేషం కలగడ మెట్లాగో! ఈ విధముగా రెండు రకాల గుణాలలోని తీపి చేదు.... అనుభవమువలన స్పష్ట మౌతవి."

ఈ కథలో ఒకచోట కవి హృదయ మీరీతి సమా విష్కృతమైనది.

"తపస్సు"లో వెంకటరత్నముగారంటారు "సామ దాన భేదాది చతురుపాయములచేత దేశాక్రమణము చేసినా దానిని సుస్థిరముగ నిలబెట్టుకొని దాని హృదయమును-ఆహరించాలంటే దాని దాసుడికే లొంగుతుంది. భరత వర్షము నిక్కినీల్గి మీసాలు మెలివేసే రావణ వంశీయులకు గాని - టక్కుటమారాలు చేసే మేనకా జాతికి గాని తల ఒగ్గదు."

భారత భూమి యొక్క పవిత్రతను ఔన్నత్యాన్ని వివరించుచున్న మాటలివి. భారతీయ సంస్కృతిని యెంతగా వెంకటరత్నముగారి పలుకులు విశదీకరిస్తున్నాయి.

"నేతి నేతి" అను కథ మహోదాత్తమైనది.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే!
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః

అన్న సిద్ధాంతానికి భాష్యముగ నున్నదీ కథ. సారాంశమును వివరించుటకుగాని ఒకముక్కలో హృదయమును వ్యక్తీకరించుటకుగాని వీలుపడదు. ప్రత్యక్షరమును-ప్రతి సన్నివేశమును శ్రద్ధగ చదివి సంతసింప వలసినదే.

" పూచిన పనసచెట్లు, జామచెట్లు, నిమ్మలు సంపెగలు, దానిమ్మలు, దిరిసెనలు, గులాబులు, పారిజాతాలు ........ ఎట్లా ఉన్నదంటే చలికాలంలో ఒక అవ్వ చుట్టూ చేరిన మనుమలు, మనుమరాళ్ళు చలిని పోగొట్టుకొనడానికి–అందరికీ కలిసివచ్చునట్లుగా కలిపి కప్పిన దుప్పటి మాదిరిగా ఉన్నది. అరవిచ్చిన పూలు అర్ధమౌగ్ధ్యంతో తమ సౌందర్యాన్ని ఆదిత్య స్వామికి అర్పణ చేస్తూ – వెలిగ్రక్కే తమలోపలి భావ మనెడి పరిమళాన్ని మందానిలమను రాయబారి ద్వారా పంపుకొంటున్నాయి. సుడిగాలుప్ప తెరువరి మధ్యలోనే అడ్డం తగిలి తానే గుంజుకుపోతున్నాడు ! " ఒహో ! ఎట్టి సొగసైన ఉత్ప్రేక్ష – ఎంతటి మధుర వర్ణనాత్మక దృశ్యము !

# ప్రణయవాహిని

పవిత్ర ప్రేమను గురించియు దాని విలువలను గురించియు భావించి భావించి విరచించిన మనోహర కావ్య రాజమిది. ప్రేమ విషయమున వెంకటరత్నముగారెట్టి విశిష్ట వినూత్న భావములు గలవారో ? మనకీ కావ్యమెఱుక పరచును. స్నిగ్ధ ప్రేమకు సంబంధించిన లోతుల నక్షర క్రమబద్ధ మొనర్చు ప్రయత్నమిది. కామమునకు ప్రేమకును గల అంతరములను మరొక మారు సుదృఢ ఫణితిలో నిందు వివరించినారు.

కడచిన జన్మలన్ గలుగు కష్ట సుఖంబులు నొక్కటైనయె
వ్వడు గురుతింపలేడు-వయి వచ్చెడి జన్మలనూహ సేయజా
లడు - ఇక వ్యర్థ వాదులు విలాసముకై నడిపించురిత్త కే
రడములు జిక్కి ప్రేమ మధు రాజ్య మరాజకమౌట
యుక్తమే !

ప్రేమ మధు రాజ్యమునం దరాజకము తొంగి చూడ రాదు. స్థాయి తగ్గరాదు. ప్రేమ దైవస్వరూపము గదా !

ఏనాడుద్భవమయ్యె జీవకుల మందీ స్నేహ భావం బిలన్
జ్ఞానా జ్ఞాన విభేదవస్తుగత సంజ్ఞల్లేక-తత్స్నేహమే
నానా.శక్తిదమై అగోచర మహానందంబులూరించుచున్
ప్రాణిశ్రేణిపరస్పరంబు విడిపోవన్ రాక బంధింపదే !

ప్రాణిశ్రేణి పరస్పరంబు విడిపోవన్ రాక బంధించు స్నేహ బలమట్టిది. ఈ బలమును బెంచుకొనియెడి ప్రణయ జీవనుల మనుగడ మందార పుష్ప తరు సమలంకృత సుందర బృందావనమే.

ఎందరు సుందరీమణుల నెప్పుడుగాంచమె ! లాభమేమి అం
దెందరు ప్రేమభావమున హీనమతిన్ గ్రహియించిపూరుషున్
సుందర భావజాల పరిశోభిత దివ్యకళావిలాసు నే
ర్పొంది బహూకరించి తలపుంచి వరించి సుఖించి యుండరే

నిజము. చూచిన వారినందరిని తలపుంచి వరించుట జరుగునా

కలిపి హృదయాన హృదయమున్ గౌగలించి
కష్టవహ్నుల సంతోష వృష్టి నార్చి
జీవితోత్సవ రధమున చెంతనుండి
ప్రాణపతి దన్పు సతి యెంత భాగ్యవతియొ !

ప్రణయధారలీల పదముల జాలు గూడ వినిర్మలతను సంతరించుకొని ముందునకు సాగిన యీ కావ్యము వెంకట రత్నముగారి పవిత్ర ప్రణయ దృష్టికి-రసబంధుర పద సందోహసంధాన చతురిమకు సాక్ష్యముగ నిల్చుచున్నది.

# మైనాదేవి

చరిత్రాత్మక పద్యకావ్యమిది. ఇందలి చరిత్ర ప్రసిద్ధాంశములను సేకరించుటకు "సర్ థామస్ హేడైరీ, టైమ్సు పత్రిక సంచికలు" జి. వెంకోబరావుగారు "సుజాత" పత్రికలో ప్రచురించిన కథానిక మొదలగు వానిని నిశితముగ పరిశీలించి యితివృత్తమునకు రూపులు దిద్దినారు. చరిత్రాంశములను పద్యకావ్యముగ జిత్రింప యత్నించుటే కత్తిమీదిసాముపంటిది. కాని వెంకటరత్నము గారి యోర్పు నేర్పు లీవిషయమున సఫలతను సాధించినవి. "మైనాదేవి" పద్య కావ్యముగ రూపు దాల్చినది.

"విమల హిమాలయోద్భవ పవిత్రధునీ! జననీ! నుతింతు నిన్నమర తరంగిణీ! కలుషహారిణీ! జహ్నుసుతా! భవత్కథా సుమ మకరంద గంధముల జొక్కియు నీకు జోహరు నీయరే కుమతులు వారికేగతులు గూర్పదలంచితివే! వియన్నదీ"

ఈ విధముగ గంగాస్తుతితో కావ్యమారంభమైనది. ఇందే మైన కావ్య కథకు సంబంధించిన సూచ్యార్థ సూచన గలదా! ఉండవచ్చును. "దేశభక్తిలేని వాని నీసడించుచు కవి యనిపించిన క్రింది పలుకులెంత పదును గలవో" తిలకింపుడు.

" తోడ బుట్టిన వాని మై తోళులొలిచి
పరుల కాళ్లకు చెప్పులప్పనము గాగ
తొడిగి ముద్దాడి కండల గుడువబెట్టు
వ్రాత నీ తల గలదొ, నిర్వాకుము. పొమ్ము "

భేష్ అద్భుతము. ఆశ్చర్యము.

ఏ దినమెట్టిదో ! ఎవరి కే ఫలమిచ్చునొ! కాలనేత యే
వాదము సేసినన్ తన వివాదము నెగ్గెడి తీర్పు సేయు కా
రాదని, లేదు నోరెరుగరానిదచేతన మిద్ది చేతనం
బీ దినుసన్న భేదమెదనించుక చింత యొనర్పడక్కటా ?

కాల నేత యిచ్చెడి తీర్పును గూర్చి కవి నిష్కర్షగ వివరించిన తీరిది.

" మరి యెచటనుండు మైనాకుమారి యిపుడు "

అని మరణించిన మైనాను గురించి వేసిన ప్రశ్నకు కవి చెప్పించిన సమాధానమెంత ఆర్ద్రముగ నున్నదో గంభీరముగ నున్నదో, గమనింపుడు.

"పోయినదా సుమమ్ము సురభూముల వీడి నిలింప పుణ్యపూ
జాయతనమ్ములో జరుగు నర్చనలందు నిరంత సౌరభ
శ్రాయమధూత్కరమ్ములు వెసన్ విరజిమ్ముచు నిర్జరాళికిన్
ధ్యేయ పదార్థమౌటకని తెల్పక తెల్పెను రామపాలుడున్"

కథలో తిరిగిన మలుపులన్నింటిని వివరింప బూనినది యొక ప్రత్యేక గ్రంథమగును. మైనాదేవి వెంకటరత్నము గారి హస్తమున అద్భుతావహమైన అమర శిల్పముగ తయారయ్యెననుట అక్షరాక్షరసత్యము. తాంతియాతోపే వంటి మహోదాత్త దేశభక్తుని చరిత్రతో కలిసి ప్రవహించిన మైనాదేవి కథ పరమరమణీయము, రుచిరరసపూర్ణము.

# దక్షిణ

సంవత్సరాల తరబడి ప్రదర్శింపబడి రంగస్థలము నకే అలంకారముగ భాసించి ప్రేక్షకుల ముగ్ధుల గావించిన దృశ్యకావ్య మిది.

నను గని పెంచి నా చదువు నాటికినాటికి పెంపుజేయ దీ క్షనుగొని సౌఖ్యమేమఱచి సంతతమున్ దపియించి పోయె నా జనకుడు-జ్ఞానవార్నిధి విచార తమస్సున ముంచి నన్ను చి ద్ఘనము తదాత్మశాంతి గొనగానిది తర్పణమౌత నేటికిన్.

తండ్రి యాత్మశాంతి కొరకై సాహిత్య తర్పణముగ నంకితము చేయబడిన కృతి ఈ దక్షిణ.

జ్ఞానవార్నిధియైన జనకుని తపఃఫలముగ జన్మించిన వెంకటరత్నముగారు గూడ జ్ఞాన వార్నిధి యౌట భగ వానుని అనుగ్రహ విలాస విశేషము.

భారత కథాభాగాన్ని నాటకరూపమున మిత్రుల కోరిక మీద రచించి ప్రదర్శన కందించిన వెంకటరత్నము గారు కథా భాగమున క్రొత్తదనము నెన్నుకొనుట విశేషము. భారత నాటకములనగానే "తిరుపతి కవులు" గుర్తుకు వత్తురు. వారి తరువాత భారత నాటకముల నెవరు రచించినను పసలేనివే కాగలవు. వాని జోలికెవ్వరును బోవరు. కాని! భారత కథనే వెంకటరత్నముగారు గ్రహించుట, అందును నాటక రచనకు బూనుకొనుట సాహసోపేత విషయము.

వెంకటరత్నముగారు భారతము నందలి "ఉదంకో పాఖ్యాన కథ"ను గైగొనుటలో "దక్షిణ" నామకరణ మొనర్చుటలో సొగసు వచ్చినది. భారతమున ఉదంకుని కథ ఆదిపర్వమునందొక విధముగ నుండ - అశ్వమేధ పర్వమున మరొకరీతిగనున్నది. వెంకటరత్నము గారు సుందర విషయభరితమైన అశ్వమేధ పర్వాంతర్గత కథా భాగమునే గైకొనినారు. జయబాల అహల్యా గౌతముల ప్రియపుత్రిక. ఉదంకుని హృదయ సామ్రాజ్య సర్వాధికారిణి. వీరిరువురి ప్రేమ యీ కథా భాగమున కూపిరి. ఉదంకుని నాగలోక ప్రయాణము, కుండలముల విషయము నాటకమున ప్రక్షిప్తము లయినవి. మహాద్భుత సంగీత విద్యాప్రవీణుడుగా ఉదంకుడు రంగ

స్థలమున ప్రత్యక్షమగును. వివిధ దృశ్యముల మధ్య విసుగు బుట్టని రీతి చకచక సాగెడి యీ నాటకము ప్రేక్షకుల మన్ననలకు విశేషముగ పాత్రమైనది.

తెలంగాణమునం దఖండ కీర్తి గడించిన ప్రజ్ఞాశాలియైన యీ సర్కారు జిల్లాల కవిపట్లనాడచటి తెలుగువారు ప్రాంతీయ తారతమ్యములను విస్మరించి అఖండ భక్తి గౌరవాదరములను జూపినారు. ప్రముఖ కవిచంద్రులయిన "శ్రీరాయప్రోలు"వారి ఆధ్వర్యమున బ్రహ్మాండమైన సభ జరిపి సన్మానించినారు. ఆ మనోహర మధుర సన్నివేశమునకు జ్ఞాపకముగా కవిగారి మిత్రులు "దక్షిణ" నాటకము ముద్రణము గావించుట మిక్కిలి శ్లాఘనీయము.

ఆ మహా సన్మానమునకు ప్రత్యుత్తరముగ వెంకటరత్నముగారు పలికిన పలుకులు "వినయకళాత్మకములు".

నేననుకొని మన్ననలు నిల్పుట నాపయి మీది దోషమే
కాని రవంత నాకు సమకట్టదు - నేను కవిత్వతత్త్వసం
ధానమెరుంగ శబ్ద గుణధర్మ విచార మెఱుంగగాని - నా
మానస వీధులన్ గనెడి మల్లెల మొల్లల దండ లల్లెదన్.

ఇక్కడ వెంకటరత్నముగారి ప్రతిభకు పదును బెట్టిన మహా వ్యక్తుల గురించి కొంత తెలుసుకొనుట చాల అవసరము. గురువు యందు పరమ విశ్వాసముతో గూడిన భక్తి-సముచిత వినయము గలిగి విద్యార్థులు సంచరించెడి

రోజులవి! విద్యార్థుల యెడ గురువుల గుండెలలో అపార ప్రేమయు, నాడు స్పష్టముగ వ్యక్తమగు చుండెడిది. వెంకటరత్నముగారి అదృష్ట విశేషమువలన వారికి అన్ని సందర్భాలలో గూడ యోగ్యతములైన అధ్యాపకులే లభ్యమయ్యారు. బాల్యమున విద్య నేర్పిన వారందరు గట్టి పునాది వేసి మాతృభాష విషయమున శిష్యునిలో మంచి మమతను కలుగజేశారు.

సంస్కృతి పట్ల భక్తిని రగిలించారు. కావుననే వెంకటరత్నముగారు పాశ్చాత్య విద్య నార్జించినప్పటికిని భారతీయ తాత్త్విక దృష్టిని విస్మరించలేకపోయారు. సుప్రసిద్ధ సంస్కృత పండితులకు కేంద్రమైన ఆకిరిపల్లి పాఠశాలలో శ్రీ సంపత్కుమారాచార్యులు గారనెడి ప్రముఖ విద్వాంసుని వద్ద అధ్యయనము గావించిన వెంకటరత్నము గారికి కొంత తృప్తి కలుగక పోలేదు. కాని! జగద్విఖ్యాతి గన్న వేలూరి శివరామ శాస్త్రి చరణులవద్ద చదువునప్పుడు కలిగిన సంతోషము సరిసాటి లేనిదని వారంటారు. ముఖ్యముగా శ్రీ శివరామ శాస్త్రిగారు వెంకటరత్నానికి వ్యాకరణ పాఠము చెప్పారు. కౌముది చేతబట్టి దగ్గరకు చేరగనే ఆప్యాయముగ వారేమి నేర్పెడి వారో; వీరేమి నేర్చెడి వారో! తెలియదు. కాని! సాధు శబ్ద స్వరూప విజ్ఞానము ప్రయోగ నిపుణత శ్రీ శివరామ శాస్త్రిగారి వద్దనే వీరికి పట్టుబడెనని ఘంటాపథముగ జెప్పవచ్చును. పైగా

అంతకు ముందే వెంకటరత్నముగారు ప్రఖ్యాత కవి చంద్రుల జంటలో నొకరగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి వద్ద చదివియున్న వారగుటచే వీరిపట్ల శ్రీ శాస్త్రి గారికి అనురాగము మెండుగ నుండెనేమో! సూరవర మనెడి పల్లెటూరిలో మామిడితోట కొని పాక వేయించి - అచట వెంకటరత్నముగారితోపాటుగ శ్రీశివరామశాస్త్రిగారు కాపురము బెట్టారట. స్వయం పాకమే. పనికి చాకలి యుండెడివాడు. కన్నతండ్రి వలె మమకారమును జూపుచు పాఠాలు చెప్పిన కాలమును తలచుకొని - శివరామ శాస్త్రిగారిని ఆయన సర్వదా స్మరించుచుండెడివాడు.

అసలు శాస్త్రిగారి విద్యాబోధనయే నూతన ప్రమాణము లలో కొనసాగుచుండెడిదట. ఉదయమే ఉపనిషత్తులను బోధించేవారట. మధ్య మధ్య అరవిందయోగి వంటి మహ నీయుల ఆంగ్ల వ్యాఖ్యానాలతో శంకర భాష్యమును బోధించి వివరించెడి వారట. మధ్యాహ్న సమయమున వ్యాకరణ పాఠము సాయంత్రము పూట సంస్కృత నాట కాలు చెప్పెడి వారట. ఈ తీరున విద్య నొక ప్రణాళికాబద్ధ ముగ నార్జించినవారు కావుననే వెంకటరత్నముగారు సారస్వత సృష్టిలో నిష్ణాతులయ్యారు. వారికి విద్యా భ్యాసన కాలము నుండియే కవిత వ్రాయు టలవాట యినది. కవిత వ్రాయుటలవడిన వ్యక్తులూరకుండజాలరు. సమయము కలిసివచ్చినపుడు సందర్భము కుదిరినప్పుడు కలము పట్టుచునే యుందురు.

ఒక మారు గురువుగారు గ్రామాన్తరమునకు వెళ్ళి యున్న సందర్భమున వెంకటరత్నముగారికి మేఘ సందేశము నాంధ్రీకరింపవలయుననెడి తలంపు కలిగినది. వెంటనే వారాపని కుపక్రమించి కొన్ని శ్లోకాలను తెలిగించారు. కవికుల గురువైన కాళిదాస మహాకవి గ్రంథములలో కల్పనా చతురిమకు ముకుటాయమాన మనదగిన మేఘ సందేశమున కనువాద మొనర్చుటనిన నది సర్వసామాన్య విషయముగాదు. కాని ! వెంకటరత్నముగారా పనిని నిండు గుండెతో ప్రారంభించారు. గురువుగారు; తిరిగి వచ్చిన తరువాత వెంకటరత్నముగారి అనువాద పద్యాలను యాదృచ్ఛికముగ చూచి చదువుట తటస్థించినది. నాడు పాఠము చెప్పుట పూర్తి కాగానే "శాస్త్ర పాఠము చదువు విద్యార్థి కవిత్వము వ్రాసి చెడిపోయిన విషయము" వివరించి నారట - దీనిని వినిన వెంకటరత్నముగారి వివేక నేత్రము విప్పారినది. అంతే అది మొదలు విద్య పూర్తియగు నంతవర కాయన కవిత మాటనే కాలపెట్ట లేదు. తొలుత మేఘసందేశము ననువదించుచు వ్రాసిన పద్యాల తగితము లను గూడ చించివైచిరట. గురువుల పరోక్ష సూచన యెంత బలిష్ఠమైనదో! శిష్యుల గ్రహణశక్తి యెంత వరి ష్ఠమైనదో గుర్తించుటకీ ఘట్టము చాలును.

శివరామ శాస్త్రిగారు కౌముది పాఠము చెప్పగనే వెంకటరత్నముగారి మనస్సులో నాటి పాఠసారాంశము

సవివరముగ ముద్రపడెడిదట. విశ్రాన్తి సమయమున మనన మొనర్చి గురువుగారి వ్యాఖ్యాన విశేషము లన్నింటికి సమగ్రమైన తెలుగు టీకను వెంకటరత్నము గారు వ్రాసి భద్రపరచుటారంభించారు. శివరామ శాస్త్రి గారి బోధనా పటిమ యెట్టిదో! వెంకటరత్నముగారి ధారణా దక్షత యెట్టిదో! యోగ్య గురు దేవునకు యోగ్యతమ శిష్యరత్న మన్వేషింపకయే లభ్యపడునట. అట్లున్నది వీరిరువురి గురు శిష్య సంబంధము. సర్వార్హతలు గల శిష్యుడు - సర్వోత్తముడైన గురువును వెదకుకొనుచు బోవుటలో వింత యేమున్నది? అట్టి గురుశిష్యసమ్మేళ నమే అపూర్వము. అది జరుగుటయే తటస్థించ వలెగాని పండున దంతయు బంగారమే.

అట్టి బంగారమే వెంకటరత్నముగారు తెలుగున వ్రాసిన కౌముది టీక. కౌముది కంఠగతముగాక-కంఠగత మైన అంతరార్థములు; విశేషార్థములు, మనసున కెక్కక - మథనపడుచుండుట కౌముది పాఠము చెప్పుకొనెడి విద్యా ర్థుల విషయమున సర్వసామాన్య విషయము. కాగా వెంకటరత్నముగారిట్లు చదివినంతవరకు కౌముదికి భాష్య మనదగిన తెలుగుటీకను సంతరించుట మాటలా! శబ్దా ధికార ప్రకరణమువరకు వారట్లు వ్రాశారు. అది అప్పల జోగన్న శాస్త్రిగారి గ్రంథము వలె తయారైనదట. కౌముదికి వ్యాఖ్యగా వెలువడిన గ్రంథములలో నేటి కాలమున - అప్పల జోగన్న శాస్త్రిగారి గ్రంథమున కొక ప్రత్యేకత యున్నది.

విశేషమేమన జోగన్న శాస్త్రిగారి గ్రంథమును దలపించు వెంకటరత్నముగారి వ్యాఖ్యను గురుదేవుడు చూడరాదని ఆయన భావించాడు కాని! ఒకనాడు శివరామ శాస్త్రిగారు కౌముది తెలుగుటీకను చూడనే చూచారు. కవితను వ్రాయవలదని పరోక్షముగ సూచించిన రీతి తెలుగు టీక వ్రాయవలదని వారన లేదు.

" ఆ పద్ధతి మంచిదే. వ్రాయవచ్చును. "
శివరామశాస్త్రిగారి ప్రోత్సాహకర వాక్యము వెంకటరత్నము గారికి కొండంత బలమునిచ్చి యుండును. వారిరువురు గురు శిష్యులవలెగాక తండ్రి తనయుల మాదిరి ఒక్కొక్క తఱి స్నేహితుల చందమున వ్యవహరించుచుండెడివారట.

సూరవరంలో వారుంటున్న మామిడితోట ప్రక్కనే గల కొండమీదికి వారిరువురు వ్యాహ్యాళి వెళ్ళేవారు. కబుర్లుగా కావ్యాలను గూర్చి శాస్త్రాలనుగూర్చి మాట్లాడు కొనేవారు. గాలి పీల్చుకొని తృప్తిగ తిరిగి దిగి వచ్చెడి వారు. తోటలో గుబురుగా గుడిసె మాదిరి పెరిగిన రెండు మామిడి చెట్లుండేవట. అవి రెండును వారిద్దరికి విశ్రాంతి మందిరాలు. వారి అనుబంధము నేమనుకొనవలెను? శిష్యుని యెడదలో చిగురించుచున్న భావాంకురములకు ప్రోదిసేసి వర్ధమాన దశకు గొనితెచ్చుట జీవితాదర్శముగ నెంచి, భావించి, ఆనందించెడి గురువులెందరుందురు? అట్టివారి సన్నిధిలో విద్యనార్జించు భాగ్యము లబ్ధమగుటయే శిష్యుని పురాకృత సుకృత ఫలము.

శివరామశాస్త్రిగారి వద్ద శిక్షణ తీరే వేరుగనుండునని చెప్పవలసిన పని లేదు. శిష్యులను సమయ సందర్భాల ననుసరించి స్నేహితుల వలె భావించెడి విశాల భావనులు వారు. కావుననే వారిని కవులలో కవినిగా-పండితులలో పండితునిగా - శాస్త్రవేత్తలలో శాస్త్రవేత్తనుగా - గురువులలో గురువునుగా - శిష్యులలో శిష్యునిగా అందరు సంభావింపగలరు.

ఒకసారి శ్రీ శాస్త్రిగారు శతావధాన నిర్వహణ విషయములో తనను తానుగా పరీక్షించదలచుకొనినారట.

అందుకు సాధనముగా శిష్యుడైన వెంకటరత్నము గారిని ఉపయోగించుకొన సంకల్పించడము విశేషము. వెంకటరత్నముగారొక తెల్లకాగితాల పుస్తకమును తీసుకొని- వరుసగా శీర్షికలు; చెప్పవలసిన వృత్తాలు; వ్రాసి సిద్ధ పరచటం జరిగేది. వరుసగా క్రమము తప్పని ధోరణిలో శాస్త్రిగారు పాదముల ప్రకారము చెప్పుకొని పోవుచు వెంకటరత్నముగారిని గూడ ధారణ పట్టవలసినదిగా సూచించేవారు. వెంకటరత్నముగారు గూడ శ్రీ శాస్త్రిగారి చేతిలో నూతనముగ తీర్చి దిద్దబడుచున్న శిల్ప సదృశు లగుటచే-యత్నించి నలుబది పాదములు మాత్రమే ధారణ పట్టగలిగినారట. తడుముకొనక మిగిలిన అరువది పంక్తులను శాస్త్రిగారు వినిపించి శిష్యుని నిర్విణ్ణుని గావించుటొక మహాద్భుత ఘట్టము.

తన శిష్యుడు తనవలెనే మంచి భావుకుడు కావలె ననియు—తన వలె తగిన ధారణ శక్తి గలవాడుగా తయారు కావలెననియు కాంక్షించెడి ఆదర్శ గురుదేవుడాయన. ప్రతి రాత్రియు – రఘు వంశాది కావ్యాలలో కొన్ని సర్గలకు సర్గలు ధారణ పట్టు నిమిత్తము చదువుమని శిష్యుని శివరామ శాస్త్రిగారాదేశించెడివారు. మరునాడుదయము పనిగట్టుకొని - ఆ సర్గలన్నింటిని అప్పగించుకొనెడివారు. తన శిష్యుని మేధా వికాసమునకు జ్ఞాపకశక్తి పెంపుదలకు శేముషీ విలాసాభ్యున్నతికి యింతగ చొరవ దీసుకొను వారికడ చదివెడి అదృష్ట మబ్బిన శిష్యుల దే మహా భాగ్యము.

రామ తీర్థాది సంయమిచంద్రులనుగూర్చి ఆంగ్ల మున రచించిన గ్రంథములను తానే ఎంపిక జేసి యిచ్చి శిష్యుని చదువమని ప్రోత్సహించుట శివరామశాస్త్రిగారి కొక సరదా యేమో! వెంకటరత్నముగారి చేత నిత్య మట్లు చేయించెడి వారట. అవసరమైన అంశముల యెడ శ్రద్ధగైకొని యింతటి మమతను జూపెడి గురువులవద్ద చదువుట వలననే వెంకటరత్నముగారి శ్రమ అన్ని విషయ ములలో అనుకొన్న దాని కన్న మిన్నగ సఫల ప్రయోజన మును వారికి సిద్ధింపజేసినది. సదభ్యాస మొనర్చిన - ఒక అవధానికి ఉండవలసిన లక్షణములన్నియు తన శిష్యునిలో వెల్లివిరియింపజేయుట కొరకే శివరామశాస్త్రి గారిట్టి వైజ్ఞానిక పరిశ్రమను వెంకటరత్నముగారి చేత జేయించి యుందురు.

శాస్త్రిగారు పదముల ప్రయోగవిషయమున అసిధారా వ్రతము నాచరించెడి వారు. వారు ప్రయోగించిన పద మెట్టి దైనను లాంఛన ప్రాయముగ వాక్య పూరణార్థ మాత్ర పరిమితి కలదిగ నుండదు. శబ్దము శాస్త్రిగారి కనుసన్నల మొక్కుబడులు చెల్లించుచు సంచరించును.

ప్రత్యేకార్థగర్భితమై వాక్యమునకు సొయగమును గూర్చును. శ్రీ శివరామ శాస్త్రిగారి పద ప్రయోగమిది యని వాఙ్మయానుభవము గల వారెవరైన పసిగట్ట వచ్చును.

వారి పదముల బాణీ విలక్షణమైనది. సలక్షణమైనది. శిష్యుని కా వరవడియే పట్టుబడినది. కావుననే వెంకట రత్నముగారి రచనలో నే యొక్క పదమును గాని వదలి వేయుటకు వీలుపడదు. వదలినప్పటికిని భావము చక్కగనే యమరునని చెప్పుటకు వీలులేదు.

గురుదేవుని చరణ సన్నిధిలో మెలుగులు దిద్దుకొనిన వెంకటరత్నముగారి పద ప్రయోగ సరళి - ఆణిముత్యమై మెరసిన మాట సత్యము.

పూజ్య గురుదేవులు కాలధర్మము నందినపుడు బావురుమనుచున్న వెంకటరత్నముగారి గుండెనుండి దూసు కొని వచ్చిన కరుణరస ప్రపూర్ణములయిన పద్యములే

"భక్త్యంజలి" యనుపేర 26-3-67 "ఆంధ్రప్రభ"లో వచ్చినవి.

పసితనమందు నన్నని అపారకృపన్ దగు విద్దె సెప్పి సం
తసమున దేల్చి యీ తెనుగునాలుక నిచ్చిన మీ ఋణమ్ము
ధాత్రి సకలమిచ్చినప్పటికి తీరదు గాన దయామయా!
నమః కుసుమము నిత్తు రిక్తుడను కోపము లేదుగదా!
గురూత్తమా!

ధాత్రి సకల మిచ్చినను తీరని గురు ఋణము నమః కుసుమములిచ్చి తీర్చుకొనిన వెంకటరత్నముగారు గురుదేవులకు కోపము దెప్పించ లేదు. వారి పూర్ణానుగ్రహమునకు పాత్రులై అంతటి వారగుటకు దగిన రీతి కృషి జేసినారు.

గురుకులవాసమై వనము కోకిలగొంతుల లేళ్ళగిట్టల
సురుచిర బంభర ధ్వనులశోభ వెలార్ప - రసాల మల్లి
కా తరువులనిచ్చు నీడల నితాంతము చింతన జేసి
మీ కుటీ పరిసరమందు నేర్చినదె: పాఠము మీరెరుగురుల్
గురూత్తమా!

అదే-వారి వద్ద చదివినదే పాఠమట. వారే-శ్రీ శివరామశాస్త్రి గారే గురూత్తములట. ప్రగాఢ భక్తితో వెంకటరత్నముగారు పలికిన పలుకులు శిష్యలోకము గురువుల పట్ల చూపవలసిన వినిర్మల భక్తితత్త్వమునకు మచ్చుతునకలు.

రసమయ కావ్యముల్ - పెడసరమ్మగు వ్యాకరణమ్ము
దేవతాశ్వసితములైన యయ్యుపనిషత్పదముల్
మధురాంధ్ర భవ్యవాక్కు సుమ మరందముల్ చవులు
గొల్పగ దెల్పిన మీద బోధనాభ్యసనము సాజమున్ దొరక
దప్పటికిప్పటి కెచ్చటన్ గురూ!

అట్లు బోధించి యుందురు శ్రీ శాస్త్రిగారు. ఆ ధోరణి అప్పటికి ఇప్పటికి గూడ మరొక్క చోట వెంకటరత్నము గారు గమనింపలేకపోవుట వలననే ఇట్లు వ్రాయగలిగిరి.

మొత్తము మీద వెంకటరత్నముగారి కబ్బిన ప్రజ్ఞ-భాషాపాండిత్యము శాస్త్ర విజ్ఞాన పాటవము మొదలయిన వన్నియు శివరామశాస్త్రిగారి శుశ్రూషా ఫలములనియే భావింపవలసి యున్నది. పండిత లోక భాస్కరులుగా ప్రకాశించిన శాస్త్రిగారిచే సర్వ విధముల సుశిక్షితులై సానబెట్టబడుట చేతనే వెంకటరత్నమింత ప్రతిభావంతముగ ప్రకాశించెననుట నిస్సంశయము.



# సంధ్యా విద్య

ధ్యానము మానవ జీవన విధానమునకు మహత్తర శక్తిని సమకూర్చు సాధనము. మనో బలాన్ని పెంచి - ఓజస్సును తేజస్సును సంఘటించుటలో ధ్యానమును మించిన విధానము మరియొకటి లేదు. ధ్యాన యోగ మగ్నులై భవ సఫలతను సాధించిన మహనీయు లెందరో కలరు. భారతీయ సంస్కృతీ చరిత్ర పుటలను తిరుగ వైచినచో ధ్యానయోగ నిష్ఠలో జన్మలను తరింపజేసికొనిన మహర్షులు, మాన్యులు, సామాన్యులు, గూడ మనకు దర్శన మిస్తారు. ధ్యానమునకుగల బలమట్టిది. ధ్యాన మంత్రము లన్నింటిలో గాయత్రీమంత్రము శిరోభూషణము వంటిది. ఓంకారనుతో ప్రారంభింపబడెడి యీ మంత్రమును లక్షల కోట్ల సంఖ్యలో జపించిన అనుష్ఠానపరులు సిద్ధ సంకల్పులు నేటికిని అటనటగలరు. గాయత్రీ మాత పూర్ణానుగ్రహమునకు పాత్రులైన వీరు కల్పవృక్షపు నీడన నున్నట్లే.

కొదువలెరుగని జీవితము ననుభవించెడి యీ యదృష్టవంతులు ధ్యాన మంత్రానుష్ఠాతలగుట వలననే వారి జీవితములట్లు కొనసాగుచుండెనని చెప్పవలెను.

వెంకటరత్నముగారు పాశ్చాత్య విద్యా పట్టభద్రు లయినను భారతీయ విద్యల లోతుపాతుల దెలిసికొనుట కహమహమిక చెందుచుండెడి వారు.

కావుననే ధర్మ ప్రబోధాత్మక గ్రంథములను సృజించిన హస్తముతో పాశ్చాత్య గ్రంథములననువ దించుటకు వెనుకాడలేదు. ప్రాక్పశ్చిమ తారతమ్యము వారికయిష్టము. భారతీయ ధార్మిక జీవనరీతిపట్ల మాత్రము కడుంగడు భక్తిగలవారనుట నిస్సంశయము. వారు సంధ్యావిద్య ను రచించి అందించుటలో గల పరమ రహస్యమదియే. సంధ్యావందనము నేటి భారతీయ జీవన లీలలో విస్మృతి పథమున పడిపోయినది. అర్థమెరిగి దీని నుపాసించువారి సంఖ్యను పెంచవలెననియు-వారా విద్యను అనుష్టానము నందుంచునట్లు శ్రద్ధ వహించవలెననియు వారు తలంచిరి.

"అపవిత్రః పవిత్రోవా" మంత్రము ననువదించుచు వారిట్లు వ్రాసినారు.

అపవిత్రుండో! పవిత్రుడో! బ్రతుకులో నౌ గాక నేమే దశా
విపరీతస్థితి బద్ధుడో! నరుడు పృధ్విన్ బుండరీకాక్షుహృ
ద్విపులాకాశములోన సంస్మరణ గావింపంగ సంశుద్ధు డౌ
నెపుడున్ లోపల వెల్పలన్ నిజము నాకీ మాట కృష్ణప్రభూ

పుండరీకాక్ష సంస్మరణతో బాహ్యాభ్యంతర శుచి యేర్పడునని - ఆపుండరీకాక్షుడవు నీవే యగుటవలన నిన్నే స్మరింతునని కవి శ్రీ కృష్ణుని ప్రార్థించుచున్నాడు.

వెంకటరత్నముగారిఅభీష్టదైవము శ్రీకృష్ణపరమాత్మ అందువలననే యిట్టి ధార్మిక దైవిక వ్యవహార నిర్ణయములను వినిపించునపుడు శ్రీకృష్ణ దేవుని పేరనే నివేదించుచుండుట పరిపాటి ప్రభుసత్తతి సర్వము నట్లే నడచినది. ప్రభుసత్తతి కనుబంధమా ! అనునట్లు శ్రీకృష్ణప్రభూ ! అనెడి మకుటముతో "సంధ్యావిద్య" రూపు దిద్దుకొన్నది. విషయమున కొంత వైవిధ్యమున్నమాట వాస్తవమే యగుగాక. కాని వివిధ సన్నివేశములు, బహుముఖ కల్పనలు, తత్త్వగంధ బంధురములై 'ప్రభుసత్తతి' 'సంధ్యావిద్య' గ్రంథముల రెంటి నొకే యొక భాగమున జేర్చుటకు వీలును గల్పించినవి. ప్రభుసత్తతికి సంధ్యావిద్య సశేషమా ! సంధ్యావిద్యకు ప్రభుసత్తతి తరువాయి భాగమా ! రెండు భాగముల యందును శ్రీ కృష్ణ ప్రభు ప్రార్థనయే. అయినప్పుడేది సశేషమో విశేష పరిశ్రమవలన దేల్చవలసిన యవసరమేమున్నది ! చెరుకు ముక్కను ఏ చివర కొరికినను మధువు తెరలి పొరలును. ముందు ప్రభుసత్తతి చదివినను - కాక సంధ్యావిద్య నే పఠించినను మానవుడార్తితో తన మొర వినుమని భగవాను నభ్యర్థించుటయే ప్రధాన విషయముగ గన్పట్టును. కాకున్న మధ్యలో నిగదితములయ్యెడి భావముల తీరు తెన్నులు మారవచ్చును.

ప్రణాళికమాత్ర మీ రెండు గ్రంథముల కొక్కటియే. అయినప్పుడే గ్రంథము ముందో తేల్చుకొనవలసినంత అవసరము గలదా! లేదని నా యూహ. రాదనియు ప్రగాఢ విశ్వాసము. పైవివరణలో గల అంతరార్థమునకు సూచికగా సంధ్యావందనరత్న ద్యుతుల ప్రసరించెడి యీ పద్య మరయుడు.

ధరపై భారతముల్ పిశాచములు భూతమ్ముల్ వడిన్ లేచి స
త్వరమే పోయెడిగాక వానియెడలన్ పైరుధ్యముల్ లేక, ను
ర్వర జేయుంగను బ్రహ్మకర్మము సమారంభింప
సంకల్పమం
దరయన్ మ్రొక్కెద నీకు నామ మెదియైనన్ నీవె
కృష్ణప్రభూ !

"నామ మెదియైనన్ నీవె" ఇది వెంకటరత్నముగారి సుదృఢాభిప్రాయము. "నదీనాం సాగరోగతిః" "సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" మొదలయిన వాక్యములీ భారతధర్మమునే ప్రబోధించుచున్నవి.

"శివునిన్ గొల్చెద విష్ణురూపునటులే శ్రీవిష్ణువున్ శైవరూ
పవిభాసున్ శివునందు విష్ణువును శైవ జ్యోతినావిష్ణు నం
దవలోకింతును-శైవ వైష్ణవములందైక్యమ్ము భావింతు నా
యువు సంవర్ధిత మౌత నాకు శివ విష్ణూపజ్ఞ ! కృష్ణప్రభూ !"

శైవవైష్ణవము లందైక్యమ్ము భావించు వెంకటరత్నము గారి దివ్యాశయము సంస్తవనీయము.

మానవుడు ఋణత్రయ విముక్తుడు కావలెననిన ఋషి ఋణమును గూడ దేవ పితృ ఋణములతో బాటుగ దీర్చుకొనవలెను. ఋషి ఋణము తీరవలెననిన సంధ్యా వందన మాచరింపవలసినదే. ఉభయ సంధ్యలలో గాయత్రీ మంత్రానుష్ఠానముతో ఋషిఋణమును దీర్చుకొనుట-అట్లుండ నిండు ప్రాతః కాల సంధ్యావందనమునైన నాచరించి లోకసాక్షియైన సూర్య భగవానుని నుండి చైతన్య దీప్తులను సంతరించుకొనుటకు యత్నించు వారెందరుందురు ? వారి సంఖ్య క్రమక్రమముగ నంతరించునేమో ! అనెడి భయముతో వెంకటరత్నముగారు కృష్ణ ప్రభు మకుటముతో సంధ్యా విద్యకు సంబంధించిన రహస్యములను విప్పి జెప్ప బూనుకొనినారు. ఆర్ష సంస్కృతి పట్ల గల భక్తి-ఆర్ష సంస్కృతిని వ్యాప్తి చేయు విషయమున గల మమత - వెంకటరత్నముగారిచే సంధ్యావిద్యను వ్రాయించి యుండును. "ఓమ్ భూర్భువస్సువః" అనెడి గాయత్రీ ధ్యాన మంత్రమునకు వెంకటరత్నముగారి అనువాదమెంత సొగసుగ నడచినదో గమనింపుడు.

"భూలోకమ్ము భువమ్ము స్వర్గము మహమ్మున్ పై
జనాఖ్యమ్ము నా
పై లోకమ్ము తపమ్ము దానిపయి నొప్పున్ సత్యమీరీతి నా
యాలోకమ్ముల సృష్టి జేసిన వరేణ్యంబైన తేజమ్ముతో
నాలో బుద్ధినిరేచు సూర్యుని గనిన్ ధ్యానింతు గృష్ణప్రభూ!

బుద్ధిబలమును పెంచి కోర్కెలను సిద్ధింపజేయు వరేణ్య మగు తేజము శ్రీకృష్ణపరమాత్మయే యని కవి విశ్వ సించినాడు.

" నమో స్త్వనంతాయ సహస్ర మూర్తయే
సహస్రపాదాక్షి శిరోరు బాహవే
సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటి యుగ ధారిణే నమః "

ఈ శ్లోకమునకు వారి భాషాంతరీకరణ మిట్లున్నది.

చేతున్ వందనమయ్యనంతునకు నేజేతున్ సహస్రార్చికిన్
జేతున్ నేను సహస్ర బాహు చరణాక్షి శ్రోత్ర శీర్షాత్మకున్
జేతున్ నేనుసహస్రనామునకు నేజేతున్ సదామూర్తికిన్
జేతున్ గోట్లయుగాల మోసెడి విరించీ! నీకె కృష్ణప్రభూ!''

సమీచీన ధోరణిలో పరివర్తితమైన భావనయిది.

కలదేపుణ్యము సర్వవేదములలో గన్పట్టు దీర్థాళిలో
ఫలమేదో! యది నిన్ను భక్తి గొలువన్ ప్రాప్తించు నీవాసనల్
గలుగున్ వాసితమై జగత్త్రయము కృష్ణా! సర్వభూతస్థ! గో
కులవాసీ! వసుదేవజా! ప్రణుతిజేకోవయ్య కృష్ణప్రభూ!

"చతుస్సాగర పర్యంతమను" ప్రవర-తెలుగున రూపు దాల్చిన తీరును గమనింపుడు.

చతురంభోధులదాక గోద్విజ శుభోచ్ఛ్రంబౌతనే మ్రొక్కెదన్
వ్రతిసూత్రమ్ములకర్త మాకగును నాపస్తంబుడున్యాజుష
వ్రతమౌకౌశికసమ్మగోత్రమగు విశ్వామిత్రుడున్ పాపసం
చితమర్షుండును కౌశికుండును త్రయార్షేయమ్ము

కృష్ణప్రభూ !

"సకలంపరస్మై శ్రీమన్నారాయణాయేతి సమర్పయామి"
అనెడి మంత్రమును వెంకటరత్నముగారు తెలుగు భాసలో
చిత్రించిన తీరును గమనింపుడు.

శ్రీమానాథ శరీర మింద్రియములున్ జేతమ్ము వాణీమనీ
షామూర్తుల్ దగనాత్మయున్ బ్రకృతిజస్వాభావికప్రీతితో
నేమార్గమ్ముల నెట్టికర్మముల నెన్నేజేయ నా సర్వమున్
నీముందర్పణసేతు గావుమని తండ్రీ ! శౌరి ! కృష్ణప్రభూ!

సంధ్యావందన మాచరించు విషయమున గాఢ భక్తి కుదుర
వలెను వెంకటరత్నముగారు కావలెనని యిందు కొఱకే
సంధ్యావిద్యను వ్రాయుటకు పూనుకొనిరనిన వారి యార్ష
దృష్టి యెంత పవిత్రమైనదో మనకు సువ్యక్తము కాగలదు.

తరువాత మంత్ర భాగమును గూడ వారు క్రమ
పద్ధతిలో ప్రచురించినారు. నిజముగ నిది గొప్ప విషయము.
సంస్కృత మూలమిది. ఇది నా అనువాదము. సరిపోల్చి
చూచి కొనుడనుటయా ! కాక పద్యమును చదివి అభిరుచి
యేర్పడిన వారికి మంత్రము నందుబాటులో నుంచుట
కొనరించిన యత్నమా యిది ? సర్వాభీష్ట ఫలప్రదాయిని
యగు గాయత్రిని స్మరింపవలసిన మహదవకాశము నెవ్వ
డును గోల్పోవకుడని హెచ్చరించిన వెంకటరత్నముగారి
సారస్వతాత్మక సూచనకు సర్వులు శిరస్సువంచవలసినదే.

సూర్యదేవుని అఖండ శక్తిని ఆవహింపజేసికొని - ఆ లోకసాక్షి దివ్యాను గ్రహబలముగ మానవుడు చైతన్య మూర్తిగా తేజస్విగా వినిర్మల మనస్విగా వర్ధిల్ల వలెననెడి వెంకటరత్నముగారి పవిత్ర సంకల్పము భావికాలమునైన పంటకురావలెనని కోరుకొనుచుయున్నది.

అనేకమంది దేశదేశాంతరములగల ప్రాజ్ఞ పండిత చూడామణులు ధ్యానమంత్రవైశిష్ట్యమును గూర్చి వివరించిన పసిడి పలుకులు గూడ గ్రంథము చివర చేర్చబడుట "సంధ్యావిద్య" కొకమహత్తర శోభను సమకూర్చినది. ఏది యేమైననేమి ? ఈ గ్రంథము వెంకటరత్నముగారి రచనలన్నింట విశిష్టమైనది. జాతికి సార్వకలీన ప్రయోజనమును సమకూర్చునది. సంప్రదాయము పరిరక్షణ గావించుటకు పకరించునట్టిది. సంస్కృతిని స్వధర్మమును గౌరవించుమని ప్రతి వారి నాదేశించునట్టిది. గాయత్రిమాత శక్తి త్రియాత్మక సమన్విత సరస్వతి, లక్ష్మి, కాళి మూర్తులకు సమన్వయ స్వరూపవైభవమే గాయత్రిమాత.

ఉపాసకుడు వాంఛించిన ఫలములను జూరగొనుటకు సందేహము లేదు. శ్రద్ధ యుండవలయునేగాని జయము లభ్యమగుట నిర్వివాదము. గాయత్రిమాత విద్యను గోరు వారికి విద్యను, సరస్వతీ స్వరూపిణిగా ప్రసాదించును. అర్ధబలమునభిలషించు వారికి లక్ష్మీ స్వరూపిణిగా సంపత్సమృద్ధి గూర్చును. ఆపదలనుండి ముక్తులు కాగోరువారికి కాళీస్వరూపిణిగా కష్టపరంపరలనుండి విముక్తిని కలుగజేయును.

# గోపికావ్యం

అద్భుత ప్రణయ రసాత్మక వాక్యమిది. శ్రీకృష్ణ ప్రణయ చిత్రణమనిన వెంకటరత్నముగారికి ప్రాణము. ఒక గోపిక - శరద్రాత్రి - పండు వెన్నెల అని ప్రారంభించి ముగ్ధశైలిలో అమోఘస్థాయిలో రచించిన యీ కావ్యమున కొక ప్రత్యేకత యున్నది. ఈ గ్రంథమున నూట రెండు విభిన్నవృత్తముల ఛందస్సు ప్రయుక్తమైనది. బహుశః ఇది యెవ్వరును సాహసించి చేయని పని. కోరి తలకెత్తుకొనిన బరువు. కాని! యీ కృషిని సవ్యముగ సరసముగ నిర్వహించినారు.

"శ్రీమహిత దేవయదు సింహమ్మృదు పాదసరసీరుహ మరంద మధురానందామిత పిపాస మెయి," అను మంగళ మహశ్రీ వృత్తము ఛందో విషయమున దిరిగిన మెలికలన్నింటికి మెరుగులు పెట్టగల పదములను పయోగించి కవి యీ రచనకు వెలుగు గూర్చినాడు. వృత్తములన్నియు క్రొత్తవియే. అయినను రచన వలన సొబగును సంతరించి కావ్యమునకు విశిష్టత గలగింపదలంచి వెంకటరత్నముగారీ బాధ్యతను స్వీకరించినారు. పదముల మృదుత్వమునకు భావములే గాక వృత్తములు గూడ కరిగి కలసిపోయినవి.

ఈ కావ్యమునకు గల చక్కని పీఠికను సమకూర్చి సర్వ విషయములను విశదీకరించిన వి. వి. చలపతిరావు గారు కావ్యముయొక్క అసాధారణ సృష్టిని గూర్చి చక్కగ వివరించినారు. ఈ అముద్రిత కావ్యము వృత్తముల విషయమున అభ్యసించువారికి; అధ్యాపకులకు గూడ ఛందో విషయమున మంచి సూచిక కాగలదు.

మొత్తము నూట మూడు పద్యములతో మాత్రమే కూడియున్నదైనను వెంకటరత్నముగారి గోపీ కావ్యమునకు మహాకావ్యముగ మన గలిగిన సర్వార్హతలు గలవు.

సర్వే జనాః సుఖినోభవంతు
శుభమ్ భూయాత్



# వెంకటరత్నంగారి జీవితరేఖలు

శ్రీకృష్ణ చరణ నీరేజ నిరంతర స్మరణకే జీవితము సంకితము జేసిన యీ పుణ్యమూర్తి జననీ జనకులు సుబ్రహ్మణ్యము, సుబ్బమ్మ దంపతులు. వెంకటరత్నము గారికి ఇరువురు అక్కయ్యలు, చెల్లెలొకామె. తమ్ముడొకరు. మధ్యవారు వీరు.

ప్లవంగ నామ సంవత్సర పుష్య శుద్ధ విదియ ఆది వారము పగలు ౧౦ ఘడియల వేళ ఏదుబాడు వంటి కుగ్రామమున జన్మించిన యీ బాలుడు ప్రముఖ కవి పండితుడుగా పలువురి మన్ననలను పలు ప్రదేశాలలో పొందగలడని నాడెవ్వరేని యూహించియుందురా! ఏమో!

మానవుల యూహలతో మాధవునకు పని యేమి? ఆ స్వామి దయదలచి యే వ్యక్తిత్వమునే లీల వికసింప జేయనెంచిన నట్లొనర్చి తీరును.

ప్రాథమిక విద్య వీధిబడిలో ఏదుబాడు నందే కొన సాగినది. పొన్నూరు కావలి పట్టణములలో - ఉన్నత పాఠశాలా విద్య అభ్యసింపబడగా గుంటూరు పట్టణమున పట్టభద్రుడగుటకు వసతి కుదిరినది. తరువాత కొంత

కాలమునకాయన తెలంగాణాలో నివసించు సందర్భమున ఉస్మానియా విశ్వ విద్యాలయము నుండి M. A. పట్టము గూడ అందుకొన్నాడు. ఇవి యన్నియు లౌకిక విద్యలు. మహోన్నత శాస్త్ర విద్యాధ్యయనమును మాత్రము వారు ప్రముఖ విద్వద్వరేణ్యుల సాన్నిధ్యమున సముపార్జించ గలిగారు.

విద్యా జీవితమున వెంకటరత్నముగారికి కలిసివచ్చిన మహా భాగ్యమిది. నాడు తిమ్మరాజు పాలెంలో ప్రతాప కృష్ణమూర్తి శాస్త్రిగారుండెడి వారు. వారానాడు ప్రాంతీయులకే గాక పరిసర ప్రాంతీయులకు గూడ విద్యాదాన మొనర్చిన, పేరెన్నిక గన్న గురుదేవులు. ప్రముఖ గీర్వాణ పండితులు. గణపతి విజయము వంటి ప్రబంధము లను రచించి ప్రసిద్ధిగన్నవారు. వెంకటరత్నముగారు వీరి వద్ద గీర్వాణ భాషాధ్యయనము చేసారు.

నల్లబాడులో, అగిరిపల్లిలో, తాను నేర్చిన సంస్కృత భాషకు మేలి మెఱుగులు దిద్దుకొన్నారు. కడియములో పుంభావసరస్వతీమూర్తులు రాజాస్థానములన్నింట ఖ్యాతి గడించి అష్ట శతావధాన విద్యకు ప్రాణము పోసిన మహా కవులు తిరుపతి కవులలో నొకరగు శ్రీచెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి మహోదయులవద్ద కవితా విద్యను శుశ్రూష సలిపి హైవస మొనర్చుకొనినారు.

ఎక్కడ ఏది నేర్చినను చిరివాడలో వేలూరి శివరామ శాస్త్రిగారిచ్చిన విద్యా శిక్షణ వారి హృదయమున గాఢాభి మాన ముద్ర వేయగలిగెనని సంతోషముగ చెప్పుకొనినాడు.

మీ కడ నేర్చిన విద్య-మీరె గురూత్తములని వారు స్పష్టముఁగ చెప్పికొనినారు.

వారివద్ద తులనాత్మక పరిశీలనతో గావించిన విద్యాభ్యాసమే వెంకటరత్నముగారి కవితా పాండిత్య భాషా విజ్ఞాన శక్తికి దీర్ఘాయువు బోసినది.

ఆయన రాష్ట్ర రాష్ట్రాంతరాలలో గూడ ఘనకీర్తి నార్జించుకొనజాలిన శిష్యవతంసుడైన శివరామ శాస్త్రిగారి విద్యా కుటుంబానికి వెలలేని వెలుగులను జతపరచినారు. ఎట్లలవడెనో తెలియదుగాని వెంకటరత్నముగారికి సంగీత చిత్రకళల యందు కూడ ప్రజ్ఞయున్నది.

కుటుంబ పోషణ నిమిత్తమై కొంత కాలము వారు ప్రయివేట్లు చెప్పారు. అన్నవరము ఉప్పలపాడు గ్రామాలలో కొంతమందికి కొంతకాలము వారివద్ద ప్రయివేటు చెప్పించుకొనెడి భాగ్యము కలిగినది. ప్రధానాంధ్ర పండితులుగా వారు పాలపర్తి, విజయవాడలలో పని చేశారు. నల్లగొండలోగల సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా ఆరేళ్ళ పాటు వారు పనిచేయుట జరిగింది. జాతీయవాదము పట్ల, దేశభక్తి పట్ల వారికెంతయో మమత గలదు.

సాహితీ మేఖల, వారు పెంచి పోషించిన కవితా సంస్థానము. ఈ సారస్వత సంస్థకు వారు చేసిన సేవ అపారము. వెంకటరత్నముగారి మిత్ర కుటుంబము సాహితీ మేఖలను బట్టియే పెంపు గాంచినది. తెలంగాణమున వారు లబ్ధప్రతిష్ఠులగుటకు ప్రబలాశ్రయ మీ

సంస్థయే. అవిచ్ఛిన్నముగ కావ్యకుసుమాలను వెలయింప జేసిన్న యీ సారస్వత సంస్థ-ఒక్కమాటలో చెప్పవలెననిన వెంకటరత్నముగారి సర్వతోముఖ ప్రతిభకు రూపాంతరము. వారా సంస్థ కధ్యక్షులుగారు. కార్యదర్శియుగారు. సర్వ సామాన్య సభ్యులు మాత్రమే. అయినను వ్యక్తి యొక్క వికాసాభివృద్ధుల కొఱకు గాక సంస్థ యొక్క ఉన్నతికే కృషి సాగించవలెననెడి ధర్మ సూత్రమును శిరసావహించి వారు శ్రమించారు.

అందమైన ముఖ పత్రము గ్రంథ హృదయమును ప్రస్ఫుటీకరించునటుల శ్రద్ధ గైకొనెడివారు. వారు ముద్రించిన ప్రతి గ్రంథము గూడ - ఏ గ్రంథమున కా గ్రంథమే యొక కళాఖండముగ మెఱయుచుండును. పద్యము, గద్యము, గేయము రూపకము, కథ, నవల, మొదలయినవన్నియు వారి చేతిలో మధుర మోహనా కృతులను దిద్దుకొని కావ్యములలో ప్రత్యక్షమైనవి. వారు మహాంధ్రకవితా వియత్పథమున ధ్రువతార వంటివారు. విజ్ఞులు, ఉచితజ్ఞులైన ఆంధ్రప్రజల హృదయకేదారా లను పులకిత మొనర్చి, సంఫుల్ల మొనర్చి భవ్య దివ్య నవ్య కావ్య సస్య సంపదను పండించు నిమిత్తమై "రస గంగ"ను ప్రవహింపజేసిన వెంకటరత్నముగారి జీవితము ధన్యము. శారదా తనయుడుగా విబుధలోక ప్రథిత కీర్తి గడించిన ఆయన కవితా జీవితము - మాన్యము.
"జయన్తితే సుకృతినః రస సిద్ధాః కవీశ్వరాః."